# డాక్టర్ అమర్‌నాథ్ అద్భుత సృష్టి

భారతదేశంలో నెంబర్-1
హెర్బల్ ఫేస్ క్రీమ్ అని ఛాలెంజ్ చేస్తున్నాం !






అందాలకు తుది మెరుగులు దిద్దే

# సింధూర హెర్బల్ ఫేస్ క్రీమ్




- ముఖంపై ముసలితనపు ముడుతలు పోగొడుతుంది.
- చలికాలంలో పొడిబారిన చర్మాన్ని ఉత్తేజ పరచి, నిగారింపు కల్గిస్తుంది.
- ఐదు వారాలలో మెరిసే ముఖ వర్చస్సు.
- వేసవిలో నల్లబడిన చర్మం క్రమంగా తెల్లబడుతుంది.
- మొటిమలు, మచ్చలను నివారిస్తుంది.
- స్త్రీలు, పురుషులు వాడదగిన ఏకైక ఫేస్ క్రీమ్.

* 25 గ్రా. - రూ. 17/- మాత్రమే

**ఉపయోగించిన వారి అభిప్రాయం**

గౌ॥ డా॥ అమర్‌నాథ్ గారికి,

నా ముఖంపైన నల్లని మచ్చలు, మొటిమలు తగ్గిపోవటం కోసం ఎన్నో రకాల క్రీములు వాడాను. ఏమాత్రం తగ్గలేదు. అద్భుతమైన **సింధూర హెర్బల్ ఫేస్ క్రీమ్** వాడిన 20 రోజులకే మచ్చలు, మొటిమలు బాగా తగ్గాయి. ముఖ వర్చస్సు కూడా పెరిగింది. మీకు అభివందనాలు.

షేక్ అన్వర్ అలి,
ఇం. నెం. 75-6-8, మోమినాన్ స్ట్రీట్, ఖమ్మం -7

అన్ని ఫ్యాన్సీ, జనరల్, బ్యూటీపార్లర్స్, మందుల షాపులలో లభ్యం



## శ్రీ సత్యసాయి హెర్బోకేర్,

నెం. 40, దుర్గానగర్ కాలనీ, చిత్తూరు. ఫోన్ : 23919, 27044



# చందమామ

## జనవరి 1998






విడి ప్రతి : 6-00

సంవత్సర చందా : 72-00

# POLIO, QUIT INDIA!

Protect your child and the nation!
Participate in the mass
polio vaccination!




**December 7, 1997**
**January 18, 1998**

CALLING PARENTS!

Even if

- the child is indisposed or has diarrhoea
- the child had been given polio drops earlier

**TO ENSURE CENT PER CENT PROTECTION**



**Remember to**

Take your children (under 5) to the nearest immunisation booth / centre to receive

**TWO ADDITIONAL DROPS OF THE ORAL POLIO VACCINE on National Immunisation Days**



Be a part of the global Polio Eradication Campaign




**You don't just have to protect, but help eradicate POLIO**






Rs. 30/-




Rs. 40/-




Rs. 30/-




s. 30/-




Rs. 25/-




Rs. 30/-

## CHANDAMAMA BOOKS ARE ALREADY A LEGEND! THEY OPEN A NEW HORIZON ON THE WORLD OF LITERATURE FOR THE YOUNG

Added to the six titles by **Manoj Das** is the charming seventh–

**WHEN THE TREES WALKED**

by the inimitable story-teller **Ruskin Bond**




Rs. 30/-

Among the titles in the process of production are:

**STORY OF KRISHNA**
**STORY OF RAMA**
**STORY OF BUDDHA**



For details, write to:

**CHANDAMAMA BOOKS**
Chandamama Buildings
Vadapalani, Madras - 600 026.




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : బి.నాగిరెడ్డి

## సన్యాసుల తిరుగుబాటు!

పద్దెనిమిదవ శతాబ్దం ఉత్తరార్థంలో మనదేశంలో ఒక అపూర్వమైన తిరుగుబాటు జరిగింది. సన్యాసులు దానిని జరిపారు. సర్వసంగ పరిత్యాగులై, అడవులలో ముక్కులు మూసుకుని కూర్చుని, జన్మ రాహిత్యం కోరుకునే సన్యాసులు ఎందుకు తిరుగుబాటు జరిపారు? తూర్పు భారతదేశమైన బీహార్, బెంగాల్ ప్రాంతాలలోని పేదరైతులను, – ఇంగ్లీష్ ఈస్ట్ఇండియా కంపెనీ– దానితో చేతులు కలిపిన స్థానిక జమీందారులు పీడించసాగారు. పద్దెనిమిదవ శతాబ్దం డెబ్భైలలో ఆ ప్రాంతాలలో తీవ్రక్షామం ఏర్పడింది. అయినా, పేదరైతులనుంచి పన్నులు వసూలు చేయడానికి, కంపెనీ వాళ్ళను దారుణంగా హింసించసాగింది.

ఈ పరిస్థితులలో కొందరు సాధువులు ఒక పుణ్యక్షేత్రం నుంచి మరొక పుణ్యక్షేత్రానికి వెళుతూ, కంపెనీ అధికారానికి ఎదురు తిరగమని సామాన్యప్రజలను ప్రబోధించసాగారు. అందువల్ల సన్యాసుల రాకపోకలమీద కంపెనీ ఆంక్షలు విధించింది. ఆగ్రహం చెందిన సన్యాసులు బృందాలుగా కంపెనీ శిబిరాలపై దాడులు జరిపి దోచుకోసాగారు. హిందూ సన్యాసులతో, ముస్లిం ఫకీర్లు కూడా కలిశారు. భవానీ పాఠక్, దేవీ చౌధురాణి, మంజూ ఫకీర్, మూశా షా, కృపానాథ్, చెరాక్ అలీ మొదలైనవారు ఈ ఉద్యమానికి నాయకత్వం వహించారు.

కొన్నేళ్ళ తరవాత ఉద్యమం అణచివేయబడింది. అయినా బంకించంద్రఛటర్జీ, 'ఆనందమఠం' 'దేవీ చౌధురాణీ' అనే తన రెండు నవలలలో ఈ ఉద్యమ గాథలను నిక్షిప్తం చేశాడు. ఆనంద మఠం నవలలో సన్యాసులు ఆలపించిన వీరగీతమే– ఉత్తరోత్తరా స్వాతంత్ర్యోద్యమ త్యాగులకు స్ఫూర్తినీ, ఉత్తేజాన్నీ కలిగించింది. అదే మనం ఇంకా పాడుకుంటూన్న 'వందేమాతరం' గీతం!

సంపుటి: 102 జనవరి '98 సంచిక : 1

విడిప్రతి : 6-00 సంవత్సర చందా: 72-00





ચાંદામામા
चन्दमामा
চাঁদমামা
ಚಂದಮಾಮ
चांदोबा
அம்புலிமாமா
CHANDAMAMA
DECEMBER 1991
चन्दामामा
చందమామ

వార్తలు-విశేషాలు:

# వందసంవత్సరాల ఓటుహక్కు తరవాత ఒక మహిళాప్రధాని!

న్యూజిలాండు తొలి మహిళా ప్రధానమంత్రిగా డిసెంబర్ 8వ తేదీ శ్రీమతి జెన్నీషిప్లే పదవీ ప్రమాణ స్వీకారం చేశారు. ప్రపంచంలోనే మొట్ట మొదట అంటే - 1893వ సం॥లోనే స్త్రీలకు ఓటింగు హక్కు ఇచ్చిన స్వతంత్రదేశం న్యూజీ లాండు అన్న విషయం ఇక్కడ చెప్పుకోతగ్గ విశేషం!

1952వ సం॥లో జన్మించిన జెన్నీఫర్, టీచర్స్ డిగ్రీ పూర్తిచేసి 1972 నుంచి '76 వరకు పాఠశాల ఉపాధ్యాయురాలుగా ఉద్యోగం చేసింది. ఒక రైతును పెళ్ళాడి, వ్యవసాయంలో ఆయనకు సాయంగా నిలిచింది. కాని ఆమె దృష్టి ఎప్పుడూ రాజకీయరంగంపైనే ఉండేది. మిత్రుల ప్రోత్సాహంతో ఆమె 1975వ సం॥లో నేషనల్ పార్టీలో సభ్యురాలుగా చేరి, పార్టీ కార్యక్రమాలలో ఎంతో చురుకుగా పాల్గొని, పార్టీ అధ్యక్షుడు జిమ్ బోగ్లెర్ దృష్టిని ఆకర్షించింది. ఆమెలోని నాయకత్వ లక్షణాలనూ, ఉత్సాహాన్నీ చూసి బోగ్లెర్, ఆమె మునుముందు అధికారంలో తనకు ప్రత్యర్థికాగలదేమో అని కూడా అనుమానించాడు. ఆ అనుమానం 1997 ముగిసే నాటికి అక్షరాలా నిజమయింది.



1987వ సం॥లో శ్రీమతి షిప్లే పార్లమెంటుకు ఎన్నికయింది. 1990వ సం॥లో న్యూజీలాండ్ ఫస్ట్‌పార్టీతో పొత్తు కుదుర్చుకుని, నేషనల్ పార్టీ నాయకుడు బోగ్లెర్ ప్రధానమంత్రి అయ్యాడు. న్యూజీలాండ్ ఫస్ట్‌పార్టీ నాయకుడు విన్‌స్టన్ పీటర్స్ ఉపప్రధాని అయ్యాడు. బోగ్లెర్ శ్రీమతి షిప్లేను సంఘ సంక్షేమ మంత్రిగా నియమించాడు. ఆమె ప్రజల విమర్శలకు గురైనప్పటికీ కొన్ని సంస్కరణలను ప్రవేశ పెట్టింది. ఆ తరవాత ఆమె 1993వ సం॥లో ఆరోగ్యశాఖనూ, 1996వ సం॥లో రవాణా శాఖనూ చేపట్టి, ఆయా శాఖలలోనూ సంస్కరణలు ప్రవేశపెట్టింది. ఆమె పలుకుబడి తగ్గుముఖం పట్టినప్పటికీ ఆమె దృష్టి అత్యున్నత పదవి మీదపడి, అవకాశం కోసం కాచుకున్నది.

బోగ్లెర్ విదేశ పర్యటనలో ఉన్నప్పుడు, ఆమె నేషనల్ పార్టీలోని మెజారిటీ ఎంపీల మద్దతు తన వైపుకు తిప్పుకున్నది. బోగ్లెర్ ప్రధానమంత్రి పదవికి రాజీనామా చేయాలని ఎంపీలు కోరారు. బోగ్లెర్ రాజీనామా చేయక తప్పలేదు.

జెన్నీషిప్లే న్యూజీలాండ్ ఫస్ట్ పార్టీతో మంతనాలు జరిపి, పొత్తును దృఢపరుచుకుని, తాను ప్రధాన మంత్రి పదవిని చేపట్టి, ఆ పార్టీ నాయకుణ్ణి యధాప్రకారం ఉపప్రధానిగా కొనసాగేలా చేసింది. మాజీ ప్రధాని బోగ్లెర్‌కు విదేశాంగ, వర్తకశాఖలను కేటాయించింది.

నూతన ప్రధాని జెన్నీ షిప్లే ఐదుఅంశాల కార్యక్రమాన్ని ప్రకటించింది. కుటుంబ, సామాజిక విలువలను పెంపొందించడం; ప్రస్తుతం వున్న 120 సభ్యుల సంఖ్యను తగ్గించి, పార్లమెంటు వ్యయాన్ని అదుపుచేయడం; విద్యా-వైద్య రంగాల అభివృద్ధికి ప్రాముఖ్యత నివ్వడం; పన్నుల తగ్గింపు -అందులో ముఖ్యమైన అంశాలు.

1999వ సం॥లో న్యూజీలాండులో ఎన్నికలు జరుగనున్నాయి. ప్రస్తుత పరిస్థితులనుబట్టి, ప్రతిపక్షమైన లేబర్ పార్టీకే విజయావకాశాలు ఎక్కువ అని పరిశీలకులు అభిప్రాయపడుతున్నారు. ప్రతిపక్షానికి కూడా ఇప్పుడు శ్రీమతిహెలెన్ క్లార్క్ అనేమహిళనాయకత్వం వహిస్తున్నది. కాబట్టి ఏ పార్టీ అధికారంలోకి వచ్చినా, న్యూజీలాండులో మహిళా ప్రధానులు కొనసాగే అవకాశం వుందని పరిశీలకులు భావిస్తున్నారు!



# మంత్రగత్తె భోషాణం

ముత్యాలవ్యాపారి మురహరికి నలుగురు కొడుకులు. పెద్దవాళ్ళు ముగ్గురూ తెలివయినవాళ్ళు. వాళ్ళు తండ్రికి వ్యాపారంలో చేదోడువాదోడుగా వుండేవారు. ఆఖరివాడు వెంకటప్ప మందమతి. అందరూ వాడిని వెంకటప్ప అనడానికి బదులు, వెర్రి వెంగళప్ప అంటూ హేళన చేసేవారు. వాడికి ఆపేరే స్థిరపడిపోయింది. చిన్నతనంలోనే తల్లిని పోగుట్టుకున్న వెంగళప్ప అంటే, మురహరికి పంచప్రాణాలు.

పెద్దకొడుకులు ముగ్గురికీ పెళ్ళిళ్ళయి, కోడళ్ళు కాపరానికి వచ్చారు. మామగారు తమ భర్తల కన్నా వెంగళప్పను ప్రేమగా చూడడం వాళ్ళకు గిట్టేదికాదు.

వెంగళప్పకు పెళ్ళిచేస్తే, అతడి ప్రవర్తనలో మార్పురావచ్చని మురహరి ఆశ. అయితే, వెంగళప్పను గురించి ఆ చుట్టుపక్కల ఊళ్ళల్లో అంతా ఎరిగివుండడంతో, వాడికి పిల్లను ఇవ్వడానికి ఎవరూ ముందుకురాలేదు. వెంగళప్ప పెళ్ళిని గురించిన దిగులుతోనే, మురహరికళ్ళుమూశాడు.

ఆరోజునుంచీ వెంగళప్ప కష్టాలు ఆరంభమయ్యాయి. వాడి వదినెలు వాడిచేత అడ్డమైన చాకిరీ చేయించేవాళ్ళు. అయితే, ఏపనీసరిగా చేయడం చేతగాని వెంగళప్ప, అప్పగించినపనులన్నీపాడుచేస్తూండేవాడు.

ఒకరోజు భర్తలు ఇంటలేని సమయంలో, వెంగళప్ప వదినెలు ముగ్గురూ నడిమింట సమావేశమయ్యారు.

"తిండికి తిమ్మరాజు, పనికిపోతురాజు! ఈ వెంగళప్పశనిని బతికున్నన్నాళ్ళూతేరగా పోషించవలసిందేనా?" అన్నది పెద్దవదినె చేతులు తిప్పుతూ.

"ఈవెర్రిమాలోకానికి పిల్లనిచ్చేదిక్కు లేదు. ఇకఇల్లరికానికి ఏఊరుపంపిస్తాం?" అంటూ మూతివిరిచింది రెండవవదినె.

మాచిరాజు కామేశ్వరరావు

"ఆ ముసలాయన పోతూ పోతూ, ఈ తద్దినాన్నిమననెత్తినపెట్టిపోయాడు!" అంటూ మెటికలు విరిచింది మూడవవదినె.

ఎలాగయినా వెంగళప్ప పీడ విరగడ చేసుకోవాలని, తోడికోడళ్ళు ముగ్గురూ కూడబలుక్కున్నారు.

అప్పటివరకూ పెరట్లోని కూరపాదులకు, బావినీరు తోడిపోసిన వెంగళప్ప ఆయాసపడుతూ వాళ్ళ దగ్గరకు వచ్చి, "ఆకలిగావుంది వదిన్లూ! అన్నంలోకి కంది పచ్చడీ, సొరకాయపులుసూ కావాలి," అన్నాడు.

ఆ మరుక్షణం ముగ్గురు వదినెలూ మూలుగుతూ, గదిలో చాపలు పరుచుకుని పడుకున్నారు. అదిచూసి వెంగళప్ప భయపడిపోయి, "ఇంతలోనే మీకేమయింది? ఒంట్లోబాగాలేదా? నాన్నలా చచ్చిపోతున్నారా?" అన్నాడు.

"నాకు సుత్తెతో మోదుతున్నట్టుగా, తల బద్దలయ్యే నొప్పి! గోధుమరంగు తాచుపాముకోరలు పీకి నిప్పులోవేసి, ఆ పొగ పీలిస్తేనేగానీ ఈ నొప్పిపోదు," అన్నది పెద్ద వదినె.

"నాకు బండరాయి లోపలవున్నట్టుగా, ఒకటే కడుపునొప్పి! పులిపాలల్లో వాముపొడి కలుపుకుని తాగితే తప్ప, ఈబాధ తీరదు," అన్నది రెండవవదినె.

"నాకు ఇసకపోసుకున్నట్టుగా, కళ్ళల్లో ఒకటే భగభగమంటలు! బ్రహ్మరాక్షసి కొమ్ము అరగదీసి, ఆ గంధం కాటుకలా పెట్టుకుంటేగానీ, ఈ మంటలు చల్లారవు," అన్నది మూడవవదినె.



వెంగళప్ప, ఆ బాధలన్నీ తనకే వచ్చినట్టుగా విలవిలలాడిపోతూ, "వదిన్లూ, డబ్బులివ్వండి! బజారుకుపోయి మీకు కావలసినవన్నీ తెస్తాను," అన్నాడు.

"అవి బజారులో దొరకవు; అడవిలో వుంటాయి! నీకు తెలుసుగా, మీ అన్నయ్యలకు ఊపిరిసలపని పని. వాళ్ళకు అడవిలోకివెళ్ళే తీరికలేదు. ఈబాధలతో మేము చచ్చిపోవలసిందే!" అంటూ గట్టిగా మూలగసాగారు వదినెలు.

జాలిగుండెల వెంగళప్ప, వాళ్ళ మూలుగులు వినలేక, "ఇప్పుడే నేను అడవికి వెళ్ళి, మీక్కావలసినవన్నీ తెస్తాను," అంటూ బయల్దేరాడు.

వాడటువెళ్ళగానే, లేచి కూర్చుంటూ, "ఈ రాత్రివెంగళప్పను తప్పక తాచు



పాము కాటువేస్తుంది! "అంటూ ఆనంద పడి పోయింది పెద్దవదినె.

"అది తప్పితే, పెద్దపులి పొట్టచీల్చడం ఖాయం!" అంటూ పొంగిపోయింది రెండో వదినె.

"పైరెండూ కుదరకపోతే,ఏబ్రహ్మరాక్షసో, ఈ వెర్రిమాలోకాన్ని పట్టుకుని మింగె య్యడం తథ్యం!" అంటూ సంతోషపడి పోయింది మూడవవదినె.

వెంగళప్ప, గోధుమరంగుతాచు, పెద్ద పులి, బ్రహ్మరాక్షసిని వెతుకుతూ, అడవిలో కొంతదూరంపోయేసరికి, బాగా చీకటిపడి పోయింది. వాడు కొన్ని పాములనుచూసి తోకపట్టుకోబోయాడు కానీ, అవి గోధు మరంగులో లేకపోవడంతో ఆ ప్రయత్నం మానాడు. వాడు అడవిలో ఎంతదూరం వెళ్ళినా, నక్కలూ, కుందేళ్ళూ, కనిపిం చాయి కానీ, పులి జాడలేదు.

వాడుఆకలితోనకనకలాడిపోతూ, "ఓసీ, బ్రహ్మరాక్షసీ! ఇటొచ్చి, నా కంటబడు!" అంటూ పెద్దగాకేకలు వెయ్యసాగాడు.

ఆ ప్రాంతాల, ఒక దిబ్బమీద గుడిసె వేసుకుని, తనకూతురితోపాటు నివసిస్తున్న మంత్రాల మరిడమ్మకు, ఆ కేకలు విని పించాయి. మరిడమ్మ గుడిసెలో దీపం వత్తి పెద్దదిచేసి, బయటకు వచ్చి, "ఎవడ్రా వాడు? అర్ధరాత్రివేళ మరిడమ్మ ఇంటికేసి రావడమేకాక, గావుకేకలా? ఆహాఁ, ఎన్ని గుండెలు!" అన్నది.

వెంగళప్ప గుడ్డివెన్నెలకాంతిలో మరిడ మ్మనుచూసి, దిబ్బఎక్కి, "అత్తత్తా! ఈచుట్టు పక్కల గోధుమరంగు తాచుపాములూ, పెద్దపులులూ, రాక్షసులూ - ఇల్లాంటివేమీ లేవా?" అని అడిగాడు.

"నువ్వనే ఆ మూడింటిపెట్టు, ఇదే మంత్రాలమరిడమ్మనునేనున్నాను! భళిరా, కుర్రకుంకా! ఇంత పొద్దుపోయి, ఆ అంకమ్మ శివాలేమిట్రా?" అని ఆశ్చర్యంగా అడిగింది.

వెంగళప్ప, తన ముగ్గురువదినెలకూ వచ్చిన బాధలూ, అందుకు విరుగుళ్ళు కూడాచెప్పి, "వాళ్ళకు కావలసినవి తీసు కుని నేను వెంటనే వెళ్ళాలత్తా. పాపం, వాళ్ళుమాత్రం ఎంతసేపని బాధ భరించ గలరు చెప్పు!" అన్నాడు.

వాడు వెర్రిబాగులవాడనీ, వాడిని చంప డానికివాడివదినెలు, ఈపథకం వేశారనీ, మరిడమ్మకు అర్థమైపోయింది.

"పుట్టు సాహసివిరా, అల్లుడూ! ఆకలితో వున్నట్టున్నావు. వెంటనే ఆకలి చల్లార్చక పోతే- సాహసం చల్లబడిపోతుంది. నాలుగు రొట్టెలుతిను," అంటూ గుడిసెలోకిపోయి, ఒక నులకమంచం తెచ్చి బయటవేసింది.

తర్వాత మరిడమ్మ, ఒక కంచుపళ్ళెంలో నాలుగు జొన్నరొట్టెలూ, ఇంత పుట్ట కుక్కలకూరా వేసి తెచ్చి వెంగళప్ప కిచ్చింది. వాడు వాటిని ఆవురావురు మంటూ తిని, మరిడమ్మ ఇచ్చిన మంచీ నీళ్ళుతాగి, "అత్తమ్మా! అడవికోడి రుచి ముందు, పూరికోడి బలాదూర్!" అన్నాడు చిటికెలు వేస్తూ.

ఆ మాటలకు మంత్రాల మరిడమ్మ పెద్దగా నవ్వి, "అల్లుడూ! అది కోడిమాంసం కాదు; పుట్టకుక్కలకూర. అందంలో రాచకన్నెలను కాదనిపించే, నాకూతురు స్వర్ణమంజరి వంట!" అన్నది.

గుడిసె బయట జరుగుతున్న ఈసంభా షణవల్ల, నిద్రాభంగమైన స్వర్ణమంజరి, "ఏమే అమ్మా! మళ్ళీ నేపాళం నుంచి, నీ గురువేమైనాతగలడ్డాడా? నేర్చిన మంత్రాలు చాలవా? ఇప్పటికే మంత్రగత్తెకూతురు నని, ఎవరూ నన్నుపెళ్ళాడడానికి ముందు కురావడంలేదు. నీకడుపున పుట్టిన ఖర్మా నికి, ఇలా అడవిమనిషిలా చచ్చేదాకా, ఈ గుడిసెలోనే బతకాలి," అన్నది పట్టరాని కోపంతో.

మరిడమ్మ, కూతురుకేమీ జవాబివ్వ కుండా, "అల్లుడూ! తెల్లవారే దాకా, ఈ మంచంమీదే పడుకో. నీక్కావలసిన వస్తు వుల సంగతి రేపుచూద్దాం," అని చేతిలోని



మంత్రదండంతో గుడిసెచుట్టూ ఒకగీత గీయగానే, భగ్గుమంటూ ఒక అడుగుఎత్తు మంటలేచింది.

"భయపడకల్లుడూ! నిప్పుచూస్తే ఏ మృగం కూడా ఇటుకేసి రాదు," అంటూ మరిడమ్మ గుడిసెలోకి వెళ్ళిపోయింది.

మరిడమ్మ అటువెళ్ళగానే వెంగళప్ప నిద్రలోకి జారుకున్నాడు. మళ్ళీ పడుకుని నిద్రపోయేందుకు ప్రయత్నిస్తున్న స్వర్ణమం జరితో మరిడమ్మ, "తర్వాత నిద్రపోదువు గాని, ముందుబయటపడుకునివున్న కుర్ర వాడు నీకు నచ్చాడో లేదో చెప్పు!" అన్నది.

స్వర్ణమంజరి గుడిసె తలుపు తెరిచి బయటికి చూసింది. గుడ్డివెన్నెల వెలు గులో-దబ్బపండు ఛాయతో పుష్టిగావుండి, ఆదమరిచి నిద్రపోతున్న వెంగళప్ప,



ఆమెకు ఎంతగానో నచ్చాడు. కూతురు సిగ్గుపడుతూ తలుపు మూసి లోపలకు రావడంచూసి, సంగతిగ్రహించిన మరిడమ్మ, "తెల్లవారగానే ఆకుర్రాడితో నీపెళ్ళి జరిగిపోతుంది. మనిషి ఒట్టి అమాయకుడైనా, చాలా బుద్ధిమంతుడు. మంచి తెలివైన ఆడపిల్లకు, అమాయకుడు భర్తగా దొరకడం, పూర్వజన్మ పుణ్యం అంటాడు- మాగురువు నేపాళభట్టు!" అంటూ పెద్దగా నవ్వింది.

ఆతర్వాత ఆమె, తెల్లవారుజామున అడవికోళ్ళుకూయడం ప్రారంభించగానే, నిద్రపోతున్న వెంగళప్పను తట్టిలేపి, "అల్లుడూ! నాకూతురు స్వర్ణమంజరిని పెళ్ళిచేసుకుంటే, నువ్వడిగినవన్నీ కట్నంగా ఇస్తాను," అన్నది.

వదినెల ఆరోగ్యం బాగుపడితే అంతే చాలనుకుని, వెంగళప్ప, "ఇంతగా అడగాలా, అత్తా! పెళ్ళేగదా, చేసేసుకుంటాను," అన్నాడు.

మరిడమ్మ అప్పటికప్పుడు కొండదేవత గుడిలో గన్నేరు దండలు మార్పించి, ఆ ఇద్దరికీ పెళ్ళి చేసేసింది. తర్వాత ఆమె, ఒకపల్లెనుంచి ఎడ్లబండిని తీసుకువచ్చి, అల్లుడూ, కూతురూ బండిఎక్కాక, గుడిసెలోంచి పాతభోషాణం ఒకటి తెచ్చి బండిలో పెట్టించి, వెంగళప్పతో, "అల్లుడా! మీవదినెలకు కట్నాలూ, కానుకలతోపాటు, వాళ్ళు కావాలన్నవికూడా, ఈ భోషాణంలో వున్నవనిచెప్పు," అని సాగనంపింది.

సాయంత్రానికి భార్యతో, ఇంటిముందు దిగాడు, వెంగళప్ప. ఆసరికి వాడు చచ్చి మామగారిని చేరి వుంటాడనుకున్నవాడి వదినెలు వాడు పసుపుబట్టలతో, బంగారపు బొమ్మలాంటి భార్యతో రావడంచూసి, విస్తుపోయారు.

బండివాడు భోషాణాన్ని లోపలిగదిలో పెట్టి వెళ్ళిపోయాడు. వెంగళప్పతో లోనికి రాబోతున్న స్వర్ణమంజరిని గుమ్మంలోనే వదినెలు అడ్డగించి, "లోపలికి అడుగు పెడితే కాళ్ళువిరగ్గొడతాం, ఎవత్తివేనువ్వు? ఎర్రగా బుర్రగా కనబడగానే కానీ కట్నం లేకుండా, మా మరిదిని బుట్టలోవేసి తాళి కట్టించుకుంటావా?" అన్నారు.

"మీక్కావలసినవన్నీ, ఆ భోషాణంలో వున్నాయని, మా అత్త మీకు చెప్పమన్నది," అన్నాడు వెంగళప్ప. ఆ మాట వినగానే ముగ్గురువదినెలూ, చావు తప్పించుకుని

వెంగళప్ప అవన్నీ ఎలా తేగలిగాడబ్బా, అనుకుంటూ ఆశ్చర్యపోయారు.

ముందుగా పెద్దవదినె గదిలోకిపోయి, ఆత్రంగా భోషాణంమూతతెరిచింది. అంతే! లోపలినుంచి నిలువెత్తుగోధుమవన్నెత్రాచు బుస్సుమంటూ పడగెత్తింది. ఆమె కెవ్వు మనబోయి నిగ్రహించుకుని, భోషాణం మూతమూసి, గదిబయటకు వచ్చి, "ఇంకా గుమ్మంలోనే నిలబడిపోయారేం? లోపలికి రండి!" అంటూ వెంగళప్పనూ, స్వర్ణమంజరినీ లోపలికి ఆహ్వానించింది.

ఈసారి రెండవవదినె హడావిడిగా గదిలోకివెళ్ళి, భోషాణం మూత తెరిచింది. లోపల కోరలుచాచి, పంజాలు ఝుళిపిస్తూ భయంకరమైన పెద్దపులి. ఆమె మూర్ఛపోబోయి తమాయించుకుని, గదినుంచి బయటికివచ్చి, "అలా నిలబడిపోయారేం, కూర్చోండి!" అంటూ వెంగళప్పకూ, వాడి భార్యకూ మంచం వాల్చింది.

మూడవ వదినె దాదాపుపరుగుపెడుతూ గదిలోకివెళ్ళి, భోషాణంమూత ఎత్తింది. లోపల తలపై రెండుకొమ్ములతో, ఒంటి నిండా రోమాలతో, చింతమొద్దు లాంటి బ్రహ్మరాక్షసి కళ్ళు నులుపుకుంటూ ఆవులిస్తున్నది.

ఇది చూసి ఆమెకు పైప్రాణాలు పైనే పోయేంత పనై, పిచ్చిచూపులు చూస్తూ బయటికి వచ్చి, వెంగళప్పా, వాడి భార్యతో, "భోజనం ఎప్పుడు చేశారో ఏమో! కాళ్ళు కడుక్కుని వస్తే, భోజనం వడ్డించేస్తాను," అన్నది.

ముగ్గురు వదినెల చేతుల్లో ఏమీలేక పోవడంచూసి, వెంగళప్ప, "మీబాధలు తగ్గిపోయినట్టున్నాయి. ఆ భోషాణం, మా గదిలోనే వుంటుంది గదా! మా అత్త పంపిన వస్తువులు, మీకెప్పుడు అవసరం అయితే, అప్పుడు తీసియిస్తాను," అన్నాడు.

"చిన్నపిల్లలు మీరు మాకిచ్చేదేమిటి! మేమే మిమ్మల్ని కంటికిరెప్పలా కాపాడుకుంటాం," అన్నారు ముగ్గురు వదినెలూ ఆప్యాయంగా.

మరిదమ్మకు తెలుసు- గదిలో ఆ భోషాణం వున్నంతకాలం, ఆ ఇంట్లో వెంగళప్పకూ, తనకూతురుకూ- ఆడింది ఆట, పాడింది పాటగా రోజులు గడిచిపోతాయని. నిజం, అక్షరాలా అలాగే జరిగింది.!



# వెయ్యినూటపదహార్లు

ఒకప్పుడు హేలాపురిని పాలించిన గౌతమసేనుడు గొప్పశివభక్తుడు, కళాపోషకుడు. రాజ్యంలో ఏ కళల్లో అయినా కౌశలం వున్నవాళ్ళు, రాజును దర్శించి తగిన బహుమతీ సత్కారం పొందుతూండేవాళ్ళు.

సుగంధపురిలో వుండే శంకరాచారి మంచి శిల్పి. తను చెక్కిన దేవతామూర్తులతో, శిల్పాలతో ఒక అందమైన దేవాలయాన్ని నిర్మించాలన్నది అతడి జీవితాశయం. అయితే, ఇందుకు ఒకలక్షవరహాలయినా ఖర్చవుతుంది.

శంకరాచారి బాగా ఆలోచించి, అర్ధనారీశ్వరుడి శిల్పాన్ని నల్లరాతితో చెక్కి, దాన్ని తీసుకుని, రాజు గౌతమసేనుడి దగ్గరకు వెళ్ళాడు. అద్భుతమైన కళానైపుణ్యంతో మలచబడిన, ఆ శిల్పాన్ని చూసి రాజు ముగ్ధుడై, "ఈ శిల్పికి వెయ్యిన్నూటపదహార్లు బహుమానంగా ఇవ్వండి!" అని మంత్రిని ఆదేశించాడు. వెయ్యిన్నూటపదహార్లు ఒక సంచీలో పోసి, వెండి పళ్ళెంలో పెట్టి, శంకరాచారికి బహుమానంగా ఇవ్వడానికి తీసుకురాబడ్డాయి. ఇది చూసి శంకరాచారి నిరుత్సాహపడ్డాడు. తన కళానైపుణ్యానికి లక్షవరహాలన్నాకోరి ఆలయం కట్టించాలనే ఆశతో వచ్చాడతను.

ఇప్పుడేం చేయాలా అని మథనపడుతున్న శంకరాచారి మనసులో, మెరుపులా ఒక ఆలోచన వచ్చింది. అతడు రాజుతో, "మహారాజా! ఈ చిన్నమొత్తం కాక, తమరు ముందు అన్నవిధంగా, వెయ్యి - నూటపదహార్లు బహూకరించండి," అన్నాడు.

రాజుకు వెంటనే శిల్పిమాటలు అర్థంకాలేదు. ఆయన కొద్దిసేపు మౌనంగావుండి, తర్వాత శంకరాచారి వాక్చాతుర్యానికి చిరునవ్వునవ్వి, మంత్రితో, "ఈ మహాశిల్పికి నేనింతకు ముందుచెప్పిన విధంగా, వెయ్యినూటపదహార్లు బహూకరించండి!" అన్నాడు.

ఆవిధంగా శంకరాచారి, రాజునుంచి లక్షవరహాలకుమించిన ధనం సంపాయించి, తన జీవితాశయమైన దేవాలయాన్ని, అద్భుతమైన శిల్పాలతో నిర్మించాడు.

– కోనే నాగవెంకట ఆంజనేయులు





# సామ్రాట్ అశోక

13

[తండ్రి బిందుసారుడి మరణవార్త అందగానే అశోకుడు ఉజ్జయిని నుంచి కొంత సైన్యంతో పాటలీపుత్రం చేరుకుని, తనను హతమార్చడానికి పూనుకున్న రాకుమారులను వధించి ముందుకు వెళ్ళాడు. తండ్రి చితికి నిప్పంటించిన తరవాత పెద్దలకోరిక ప్రకారం రాజ్యాధికారం చేపట్టాడు. తక్షశిలనుంచి క్రోధావేశంతో బయలుదేరిన సుశీముడు దురహంకారం కొద్దీ, రాజధాని నగరద్వారం దగ్గరే హతుడయ్యాడు. విదీశాదేవి అనుమతి మేరకు, పెద్దలకోరిక ప్రకారం ఒక రాకుమారిని వివాహమాడి అశోకుడు రాజ్యాభిషిక్తుడయ్యాడు. కొన్నాళ్ళ తరవాత మంత్రి, సేనాధిపతుల ప్రోద్బలంతో, కళింగపై దండెత్తడానికి పాటలీపుత్రంలో యుద్ధసన్నాహాలు ఆరంభమయ్యాయి. — తరవాత]

పాటలీపుత్రం నుంచి ఉజ్జయినికి చేరుకున్న దూత, రాజభవనంలోని విదీశాదేవిని దర్శించి, "మహారాణికి నమస్కారం!" అంటూ గౌరవంతో తలవంచి చేతులు జోడించాడు.

"నన్నంత ఆడంబరంగా సంబోధించవలసిన అవసరంలేదు, నాయనా! మీ రాజుగారు ప్రస్తుతం వివాహమాడిన అసంధిమిత్ర మాత్రమే అటువంటి గొప్ప గౌరవమర్యాదలకు అర్హమైనది!" అని దూతను మృదువుగా వారించింది విదీశాదేవి.

"క్షమించాలి, మహారాణీ! రాజుగారు ద్వితీయ వివాహం చేసుకున్నంత మాత్రాన తమరు మహారాణి కాకుండా పోరు. మిమ్ములనూ, మీ పిల్లలనూ రాజుగారు అనుక్షణం తలచుకుంటున్నారు. తమరు ఒకటికి రెండుసార్లు రాజుగారి ప్రాణాలను

రక్షించిన విషయం ఆయన మరువలేక పోతున్నారు. తమరినీ, పిల్లలనూ చూడాలని తహతహ లాడుతున్నారు. త్వరలో రాజుగారు కళింగపై దండయాత్రకు బయలుదేరనున్నారు. ఎంతటి వీరులకైనా సరే, యుద్ధంలో జయాపజయాలు ఊహించలేనివి కదా! అందువల్ల తాను దండయాత్రకు బయలుదేరేలోగా తమరినీ, పిల్లలనూ పాటలీపుత్రంలో స్థిరపడేలా చేయాలని రాజుగారు ఆశిస్తున్నారు!" అన్నాడుదూత, అశోకుడు పంపిన లేఖను ఆమెకు అందిస్తూ.

ఆ మాటలు వినగానే విదీశాదేవి ప్రశాంత హృదయంలో విషాద మేఘాలు అలముకున్నాయి. ఆమె వదనం విచారగ్రస్తమయింది. ఆ లేఖను ఆమె నెమ్మదిగా చదివింది. ఆ తరవాత ఆమె దృష్టి, దూరంగా ఒక చెట్టు కింద ప్రశాంతంగా కూర్చుని తాళపత్ర గ్రంథాలను పఠిస్తున్న తన పిల్లలు మహేంద్రుడు, సంఘమిత్రల మీదికి మళ్ళింది.

తరవాత ఆమె దూతకేసి తిరిగి, "నాయనా! ఒకప్పుడు అలజడులు చెలరేగిన ఈ నగరంలో, శాంతి భద్రతలు నెలకొనడానికి కారణం నా భర్త. ఆయన ఎంతో జాగ్రత్తగా ధర్మబద్ధమైన చట్టాలను ప్రవేశపెట్టి, వాటిని నియమబద్ధంగా అమలు పరచడానికి, నిజాయితీ పరులైన అధికారులను నియమించాడు. సమర్థవంతులైన ఆ అధికారుల కారణంగా ఈ ప్రాంత ప్రజలతోపాటు నా పిల్లలు కూడా ప్రశాంతంగా జీవిస్తున్నారు. సహజమైన



ప్రశాంత వాతావరణంలో, ఉత్తములైన గురువుల పర్యవేక్షణలో మహేంద్రుడూ, సంఘమిత్రా విద్యాబుద్ధులు నేర్చుకుంటున్నారు. అటువంటి పసివారిని కక్షలు, కావేశాలకు నిలయమై, ఇటీవలే రక్తసిక్తమైన రాజధానికి తీసుకురావడం భావ్యమా? అంతేకాదు, పూజ్యగురుదేవులు ఉపగుప్తులు తరచూ ఉజ్జయినికి విజయం చేస్తున్నారు. ఆ మహనీయుణ్ణి దర్శించి, సేవించడానికి మా పిల్లలు ఎంతో ఉత్సాహం కనబరుస్తున్నారు. అటువంటి అరుదైన అవకాశం వాళ్ళకు పాటలీపుత్రంలో లభించదు కదా! అధికారం కోసం, పదవులిచ్చే సుఖంకోసం ప్రాకులాడే రాజ్యాధికారులు తప్ప అక్కడెవరున్నారు?" అని అడిగింది విచారంగా.



దూత ఇబ్బందిగా నవ్వాడు తప్ప, మరేమీ మాట్లాడలేదు.

"నాయనా! రాజుగారంటే మాకెంతో అభిమానం, ఆరాధనాభావం ఉన్నాయి. అయితే, ఆయన దండయాత్ర పట్ల మాకేమాత్రంఆదరంలేదు. అన్నెంపున్నెం ఎరుగని అమాయక ప్రజలపై దాడి జరిపి క్రూరంగా హతమార్చడం, సంపన్న నగరాలను శ్మశానవాటికలుగా మార్చడం తప్ప ఈదండయాత్ర వల్ల ఒరిగేదేమిటి? ఈ దారుణాలన్నీ మహారాజు అశోకుడి పేరుమీదుగా జరగడం మరీ ఘోరం! యుద్ధాలలో భర్తలను, పుత్రులను, సోదరులను పోగొట్టుకుని హృదయ విదారకంగా విలపించే అసంఖ్యాకులైన అబలలను ఊహించుకుని ఎలా ఆనందించగలం? క్షతగాత్రులైన స్త్రీపురుషులు ప్రాణాలు వదులుతూ పెట్టే శాపనార్థాలు విని భరించగలమా? యుద్ధం అన్ని విధాలా అరిష్టదాయకం కదా? అందువల్ల, దండయాత్ర ఉద్దేశాన్ని విరమించుకున్నట్టయితే, నేను పిల్లలతో రాజధానీ నగరానికి రాగలనని మీ మహారాజుకు నా మాటగా చెప్పు!" అన్నది విదీశాదేవి ఎంతో గంభీరంగా.

"మహారాణీ! కరుణాపూరితమైన మీ సలహాకు ప్రత్యుత్తరమిచ్చే సావకాశం మహారాజుకు ఉంటుందో లేదో తెలియదు. ఎందుకంటే, అప్పుడే దండయాత్రకు రంగం సిద్ధమయింది. జైత్రయాత్రకు బయలుదేరేముందు తమరిని ఒకసారి చూసి వెళ్ళడానికి రాజుగారు ఆశించి ఉండవచ్చు!" అన్నాడు దూత వినయంగా.

"అది సాధ్యం కాగలదని నేను భావించడంలేదు. అయితే, ఇక్కడినుంచే మీ రాజుగారి క్షేమాన్ని కోరుకుంటున్నాను. దాపులనున్న ప్రశాంతమైన గుహలో కూర్చుని ప్రార్థిస్తాను. ఆ ప్రార్థన రాజుగారికి యుద్ధంలో విజయం చేకూరాలని కాదు; ఆయన హృదయంలో వివేకం, విచక్షణా జ్ఞానం వికసించాలని! శాంతభావం ఉదయించాలని! నువ్వింత దూరం శ్రమపడి వచ్చినందుకు కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను!" అన్నది విదీశాదేవి కరుణార్ద్ర నేత్రాలతో విచారంగా నవ్వుతూ.

దూత చేతులెత్తి నమస్కరించి అక్కడినుంచి బయలుదేరాడు.

☆ ☆ ☆ ☆

అశోకుడు సాయంకాలవేళ, పడమటి కొండలలో అస్తమిస్తూన్న సూర్యుణ్ణి చూస్తూ, పాటలీపుత్ర రాజభవనం ఉపరితలంలో పచార్లు చేస్తున్నాడు. కొంతసేపటికి యశుడు అక్కడికి వచ్చి అశోకుడికి నమస్కరించాడు. కాని అశోకుడు ఏమీ మాట్లాడలేదు. యశుడు ఆయన మౌనానికి కారణం అడిగాడు. అశోకుడు గాఢంగా నిట్టూర్చి, "ఈరోజు ఒకదాని వెనక ఒకటిగా రెండు అశుభవార్తలను వినవలసి వచ్చింది!" అన్నాడు.

"ఏమిటవి?" అని అడిగాడు యశుడు.

"కళింగ నుంచి మన గూఢచారులు తెచ్చిన వార్త మొదటిది! కళింగరాజు, వారసులు లేకుండా మరణించిన మాట వాస్తవమే. కాని, కళింగలోని ఇరవై ఒక్క పరగణాలను ఇరవై ఒక్కమంది అధికారులు ఉమ్మడిగా ఒక పాలకుడిలా ఎంతో సమర్థవంతంగా పరిపాలిస్తున్నారు. వాళ్ళ ఐకమత్యం అభేద్యం అంటున్నారు! క్రమశిక్షణకు పేరుగాంచిన వాళ్ళ సైన్యం చాలా శక్తివంతమైనది. ఇక వర్తకవ్యాపారాలంటావా? రాజు మరణానంతరం కూడా ఏమాత్రం మందగించకుండా దినదినాభివృద్ధి చెందుతున్నవి!" అన్నాడు అశోకుడు కోపంగా..

"సరే, రెండవ అశుభవార్త ఏమిటి?" అని అడిగాడు యశుడు.

"మీ గారాల చెల్లెలు విదీశాదేవి,పిల్లలు అక్కడే ఆనందంగా ఉన్నారన్న సాకుతో, పాటలీపుత్రానికి రావడానికి నిరాకరించింది!" అన్నాడు అశోకుడు.



"మహారాజా! దానిని ఒకసాకు అని మీరెందుకు భావిస్తున్నారు? పిల్లలు అక్కడ నిజంగానే ఆనందంగా ఉన్నారు కదా!" అని యశుడు కొంతసేపు ఆగి, ఆ తరవాత, "మహారాజు క్షమించాలి. నేను చెప్పబోయేది మీకు మూడవ దుర్వార్తగా ఉండవచ్చు!" అన్నాడు నెమ్మదిగా.

ఏమిటి అన్నట్టు కోపంగా చూశాడు అశోకుడు.

"మన వ్యాపారనౌకలు రకరకాల వస్తువులతో సువర్ణ ద్వీప సముదాయానికి వెళ్ళిన విషయం తమరెరిగినదే. అయితే, జావా, సుమత్ర, బాలీమొదలైన ద్వీపాలలో మన వర్తకులు ఏ ఒక్క సరుకునూ అమ్మలేకపోయారు! అక్కడి ప్రజలు కళింగ వర్తకుల నుంచి తప్ప, కొత్త వర్త



కులు మరెవ్వరి దగ్గరా సరుకులు కొనడానికి ఆసక్తి కనబరచడం లేదు. కళింగ వర్తకులు ఆ ద్వీపవాసులతో అంతటి సత్సంబంధాలు కలిగి ఉన్నారు!" అన్నాడు యశుడు.

"ఆ సత్సంబంధాలను తెగనరుకుదాం! కళింగను మనం పట్టుకున్న తరవాత, మనం అనుమతిస్తేనే కదా అక్కడ వర్తక వ్యాపారాలు కొనసాగగలవు? ఈ దుర్వార్తలన్నీ దండయాత్రకు బయలుదేరాలన్న నా సంకల్పాన్ని మరింత దృఢతరం చేస్తాయే తప్ప, ఏమాత్రం బలహీన పరచలేవు!" అన్నాడు అశోకుడు పట్టరాని ఆవేశంతో.

అశోకుడు తన బాధను, నిస్పృహను కప్పి పుచ్చుకోవడానికే అలా ఆవేశంతో మాట్లాడుతున్నాడని యశుడు గ్రహించాడు. అయితే ఆ తరవాత అతడేమీ మాట్లాడలేకపోయాడు. మౌనంగా అక్కడినుంచి బయలుదేరాడు.

☆ ☆ ☆ ☆

దయానదీ తీరంలో వెలసిన అందమైన నగరం తోశాలి. నగరానికి ఆనుకునిచిన్న చిన్న కొండలు, చక్కటి ఉద్యాన వనాలు ఉన్నాయి. దయానది సరస్వతీ నదిగా ప్రసిద్ధిగాంచిందని పురాణాలు పేర్కొంటాయి. సరస్వతీ నదీతీరంలో దధీచి అనే మునిపుంగవుడు నివసించేవాడు. ఆ కాలంలోనే వృత్తాసురుడనే రాక్షసుడు విజృంభించి, మానవులనూ, దేవతలనూ నానా విధాలుగా హింసించసాగాడు. వాణ్ణి హతమార్చడానికి ఇంద్రుడికి సాధ్యం కాలేదు. తపోసంపన్నుడైన దధీచి ముని అస్థికలతో తయారైన వజ్రాయుధంతోనే వృత్తాసురుడికి మరణం సాధ్యమని ఇంద్రుడికి ధ్యానంలో తెలియ వచ్చింది. ఆయన ఆ విషయం దధీచికి తెలియజెప్పాడు. పరోపకారమే పరమార్థంగా భావించి దధీచి, లోక కల్యాణం కాంక్షించి ఇంద్రుడి కోరికను మన్నించి, ధ్యానంలో కూర్చుని ప్రాణత్యాగం చేశాడు. ఇంద్రుడు దధీచి వెన్నెముకను తన వజ్రాయుధంగా మలుచుకున్నాడు. ముని అస్థికల తపోబలంతో, వృత్తాసురుడు ఇంద్రుడి వజ్రాయుధానికి హతుడయ్యాడు. మానవుల, దేవతల బాధలు తొలగిపోయాయి.

దధీచి త్యాగనిరతి, ఆయన పవిత్ర స్మృతి తోశాలి ప్రజలను ఆదర్శ మూర్తు

లుగా తీర్చిదిద్దాయి. ఇతరులకు సాయ పడడానికి వాళ్ళెప్పుడూ వెనుకాడే వారు కారు. బ్రాహ్మణులు అధికసంఖ్యలో ఉన్నప్పటికీ, అల్పసంఖ్యాకులుగా వున్న జైనులనూ, బౌద్ధులనూ సమానంగా గౌరవించేవారు. సుప్రసిద్ధ జైనముని ఋషభనాధ్ తీర్థంకరుడు ఆ నగరానికి చెందినవాడే. తోశాలి ప్రజలు నగర మధ్యంలో బ్రహ్మాండమైన ఆయన శిలా విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. దానిని మూడు మతాలకు చెందిన వారూ పూజించేవారు. మౌర్యవంశానికి ముందు మగధను పాలించిన ఒక రాజు ఆ శిలావిగ్రహాన్ని, పాటలీ పుత్రానికి బలవంతంగా తరలించుకుని వెళ్ళాడు. పాటలీపుత్రం మీదికి దండెత్తి వెళ్ళి, తమ శిలావిగ్రహాన్ని వెనక్కు తీసుకు రావాలని కళింగ రాజులు రెండు మూడు సార్లు ప్రయత్నించారు. కాని జైనులు వారిని వారించారు. "సహనంలో, క్షమా గుణంలో మనం ఎదుటి వారికి ఆదర్శ ప్రాయంగా నిలబడాలి. కళింగముని విగ్రహం పాటలీపుత్రాన్ని అలంకరించ డంలో దోషమేమీ లేదు. మనం మరొక విగ్రహాన్ని మన నగరంలో ప్రతిష్ఠించు కోవడమే భావ్యం!" అని రాజులకు నచ్చ జెప్పారు.

కొత్త విగ్రహాన్ని ప్రతిష్ఠించే ప్రయత్నంలో ఉన్నప్పుడే కట్టకడపటి కళింగ రాజుకు మరణం సంభవించింది!

రాజు మరణానంతరం రాజ్యంలో శాంతి భద్రతలను కాపాడడంలోనూ, వర్తక వ్యాపారాలను పెంచి, కళింగరాజ్య సంపదలను మరింత అభివృద్ధి పరచడంలోనూ పరగణాల అధికారులు నిమగ్నులైపోయారు.

ఆసమయంలో హఠాత్తుగా ఒకనాడు కళింగ రాజ్య సరిహద్దు ప్రాంతాలలో



మగధ సైనికులు పెద్ద సంఖ్యలో గుమి గూడుతున్నారని గూఢచారుల ద్వారా తెలిసి నాయకులు అమితాశ్చర్యం చెందారు. మగధ సేనలు మరెక్కడికైనా వెళుతూ, మార్గ మధ్యంలో తమ రాజ్యంకేసి వస్తున్నాయా? లేక వాటి గమ్యస్థానమే తమ రాజ్యమా? అని పాలకులు తీవ్రంగా ఆలోచించసాగారు.

అంతలోనే మగధసేనలు భీకరమైన ఉప్పెనలా కళింగరాజ్యంలోకి విజృంభించాయి. ఎదురైన అమాయక ప్రజలను హతమారుస్తూ, మార్గమధ్యంలోని ఇళ్ళను తగులబెడుతూ రాజధాని తోశాలి కేసి దూసుకు రాసాగాయి.

ఈవార్త అందగానే, "దుర్మార్గమైన ఈ దురాక్రమణను మనం ఎదుర్కోక తప్పదు. మగధసేనలను తిప్పికొట్టాలి!" అన్నాడు వృద్ధుడైన ఒకనాయకుడు.

అందుకు మిగిలిన నాయకులందరూ అంగీకరించారు. హుటాహుటిగా వారివారి పరగణాలకు వెళ్ళి దురాక్రమణను తిప్పికొట్టడానికి సిద్ధంకాసాగారు. కనీసం ఇంటి కొకరు సైన్యంలో చేరి రాజ్యాన్ని దురాక్రమణ నుంచి కాపాడుకోవాలనీ, వాళ్ళందరూ మరునాడే తోశాలి నగరం చేరుకోవాలనీ పట్టణాలలో, పల్లెలలో చాటింపు వేయించారు.

ఆ చాటింపు విన్న ప్రజలు మొదట ఆందోళన చెందారు. ఆ తరవాత తమ ఇళ్ళల్లో ఉన్న రకరకాల ఆయుధాలను చేతబట్టి రాజధాని కేసి బయలుదేరారు. తోశాలి నగరాన్ని వదులుకుంటే కళింగ రాజ్యాన్నే వదులుకోవలసి వస్తుంది. కాబట్టి రాజధానీనగరాన్ని ఎలాగైనా కాపాడుకోవాలన్న పట్టుదలతో పిన్నలూ, పెద్దలూ యువకులూ అనే తారతమ్యం లేకుండా తండోపతండాలుగా రాజధాని కేసి రాసాగారు.

ప్రశాంతంగా వున్న గ్రామాలనుంచి పురుషులందరూ వెళ్ళిపోవడంతో స్త్రీలలో ఏడుపులూ, వేదనలూ, రోదనలూ చెలరేగాయి.

రాజధానిని చేరిన సామాన్య యువకులకు, తోశాలిలోని సైనికులు శత్రువులను ఎదుర్కొనే మెళకువలనునేర్పి, తగినశిక్షణ ఇవ్వడం ప్రారంభించారు.– (ఇంకావుంది)






# ఒకగంటపాట

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, మనుషులు తరచుగా లోనయ్యే శారీరకరుగ్మతలను, మరొక మనిషి తేలికగా గ్రహించ గలడు. కాని,దానికి తగినచికిత్స వైద్యుడికిమాత్రమే సాధ్యపడుతుంది. అయితే, మానసికమైన రుగ్మతలను తెలుసుకోవడం, మరొక మనిషికి సాధ్యపడేపనికాదు. ఎందువల్ల నంటే, మనిషి మనస్సు అతి సంక్లిష్టమైనది. ప్రతిఒక్కడూ తన అనుభవాలూ, నమ్మకాల ఆధారంతోనే మరొకణ్ణి అంచనావేస్తాడు. ఒకడు తన అహంకారాన్నీ, చపలత్వాన్నీ ఆత్మగౌరవం, ఇంగిత జ్ఞానంగా భావిస్తే, ఎదుటివాడు వాటిని పచ్చి అహంకారమూ, వెర్రితనమూ అని దుయ్యబడతాడు. ఇదెం

## బేతాళ కథలు



దుకు చెబుతున్నా నంటే-అతిభయంకరమైన ఈ రాత్రివేళ, శ్మశానంలో నువ్వు పడుతున్న పాట్లకు, అలాంటి అహంకారీ, చపలుడూ ఏమైనా కారణమా అన్న శంక కలుగుతున్నది. నీకు తగు హెచ్చరికగా వుండేందుకు తుంబురుడనే సంగీత విద్వాంసుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకానొకప్పుడు తుంబురుడనే సంగీత విద్వాంసుడుండేవాడు. ఆయన సంగీత సాధనకే తన జీవితాన్నంకితం చేశాడు. ఆయనలో దైవభక్తి పొంగినప్పుడూ, ప్రకృతి దృశ్యం ఆకర్షించినప్పుడూ సంగీతం పుట్టుకొచ్చేది. ఆవిధంగా ఆయన ఎన్నో కొత్త పాటలు కల్పించాడు. ఆ పాటలను జనం ఇంటింటా పాడుకునేవారు.

ఆ దేశపు రాజు తుంబురుణ్ణి ఆస్థాన విద్వాంసుడుగా వుండమనికోరాడు. అందుకు తుంబురుడంగీకరించక, "రాజా, విహారసమయాల్లో నాసంతోషంకోసం నేను ఎంతసేపైనా పాడుకోగలను. అప్పుడు నా చుట్టూ మనుషులూ, పశుపక్ష్యాదులూ చేరి, నా పాట విన్నా నాకభ్యంతరంలేదు. కానీ కేవలం మనుషులమధ్య మనుషులకోసమే పాడాలంటే, ఎక్కడా ఒక పూటకు మించివుండలేను; గంటకుమించి పాడలేను. కాబట్టి, నేను ఆస్థానాలకు పరిమితం కాలేను," అన్నాడు.

అప్పుడు రాజుతుంబురుణ్ణి, తన ఆస్థానానికి వచ్చి ఒకగంటసేపైనా పాడమని బలవంతపెట్టాడు. తుంబురు డందుకు అంగీకరించాడు.

రాజు, మంత్రిని పిలిచి, "తుంబురుడనే మహాపండితుడు, మన ఆస్థానంలో పాట పాడడానికి వస్తున్నాడు. ఆయన ఒక్కగంట మాత్రమే పాడతానంటున్నాడు. మన ఏర్పాట్లెలావుండాలంటే, ఆయనకు శాశ్వతంగా ఇక్కడ వుండిపోవాలనితోచేలావుండాలి," అని చెప్పాడు.

తుంబురుడిగానానికి గొప్పగా ఏర్పాట్లు జరిగాయి. ఆయనకూర్చునేందుకు రత్నకంబళి పరిచారు. జారగిలబడేందుకు పట్టుదిండ్లు అమర్చారు. ఆయన పాడేటప్పుడు నర్తించడానికి అందమైన నలుగురు యువతులను ఎన్నికచేశారు. ఆగకుండా వింజామరలు వీయడానికిద్దరు దృఢకాయులను నియమించారు. ఆరోజు సభకు నగర ప్రముఖులందర్నీ పిలిచారు. పాట

ఆగినప్పుడల్లా కరతాళధ్వనులు మోగించాలని, సభికులను ముందుగానే హెచ్చరించారు. ఇక తినుబండారాలకూ, మధుర ఫలరసాలకూ లోటేలేదు.

అన్నరోజుకు, అన్నప్రకారంతుంబురుడు వచ్చాడు. రాజతడిని పూలమాలలతో స్వయంగా సత్కరించి, తను చేసినఏర్పాట్ల గురించి చెప్పి, "ఇందులోఏమైనాలోటుంటే చెప్పండి, సరిదిద్దిస్తాను," అన్నాడు.

తుంబురుడునవ్వి, "సంగీత విద్వాంసుడికి కావలసిన ఏర్పాటు ఒక్కటే, ఉత్తమ శ్రోత!" అంటూ తనస్థానంలోకివెళ్ళికూర్చుని, సభికులనుద్దేశించి, "అయ్యలారా! నా పాటలు సంప్రదాయబద్ధమైనవి కాదు. నాస్వరాలు నాలోంచిపుట్టినవి. నేను పొరబాటుచేస్తే, నన్ను నేనే సవరించుకోవాలి. తప్పు- మీలో ఎవరికీ అర్థంకాదు. కాబట్టి, నా ఏకాగ్రతకు భంగంకలిగించని విధంగా నిశ్శబ్దాన్ని పాటించవలసిందిగా కోరుతున్నాను. నేను ఒక్క గంటసేపు మాత్రమే పాట పాడతాను. సావధానులై వినగలరు," అంటూ ఆలాపన మొదలుపెట్టాడు.

అలా గంట గడిచింది. తుంబురుడు పాటఆపి, "అన్నప్రకారంగంటసేపుపాడాను. మరి నాకు సెలవిప్పించండి," అంటూ లేచి నిలబడ్డాడు. ఆయన గానం అద్భుతంగావున్నదని, మరొకగంటసేపైనా కొనసాగించమని అందరూ ఆయనను కోరారు. తుంబురు డంగీకరించక, ఫలహారాలు, ఫలరసాలు సేవించి, రాజిచ్చిన కానుకలందుకుని, అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. తమ ఏర్పాట్లు తుంబురుడినాకర్షించ నందుకు



రాజు నిరుత్సాహపడ్డాడు. ఆయన మంత్రితో, "ఈ తుంబురుడు మహావిద్వాంసుడనడంలో సందేహం లేదు. అయితే, ఈయన మహానుభావుడా, అహంకార పూరితుడా, చపలచిత్తుడాఅన్నవిషయం మాత్రం నిర్ణయించలేకపోతున్నాను. ఈయన వెంట కొందరు చారుల్ని పంపి అనుసరించమనండి. ఎక్కడైనా ఆయన ఒక గంటకు మించి పాడితే, నాకు తెలియపరచమనండి," అని చెప్పాడు.

అప్పటినుంచీ తుంబురుణ్ణి కొందరు చారులు వెంటాడుతూవచ్చారు.

రాజాస్థానంలో తుంబురుడికి జరిగిన ఘనసన్మానంగురించి దేశమంతటా తెలిసింది. ఆయనను తమ ఇంటికి పిలిపించి పాడించుకోవాలని భాగ్యవంతులెందరో



తహతహలాడారు. తుంబురుడెవరు పిలిచినా కాదనేవాడు కాదు. అయితే, ఆయన అన్నిచోట్లాకూడాగంటకుమించి పాడలేదు.

తుంబురుడి చేత గంటకంటే ఎక్కువ సేపు పాడించాలని, ఎందరికో పట్టుదల కలిగింది. ఈ పట్టుదల చివరకేదశకుచేరుకున్నదంటే–ఏ ఇంట్లో తుంబురుడు గంటకంటే ఎక్కువసేపు పాడతాడో, ఆ ఇంటివారికి రెండులక్షల వరహాలు బహుమానంగా ఇచ్చి ఘనంగా సన్మానిస్తామని, కొందరు భాగ్యవంతులు ప్రకటన చేశారు.

ఆతర్వాత, తుంబురుడి వెంటపడేవారి సంఖ్య మరింతగా పెరిగింది. పేరు ప్రఖ్యాతులకోసం కొందరు భాగ్యవంతులాయన వెంటబడితే, పేదరికాన్ని మాపుకునేందుకు కొందరు బీదవారూ, ఆయన వెంటపడసాగారు. ఆయన అందరిఇంటా పాటలు పాడేవాడు. అయితే, ఎక్కడాగంటకుమించి పాడేవాడు కాదు.

ఒకప్పుడు తుంబురుడు నిస్వార్థపరుడనీ, దయాశీలి అనీ జనం ఆయనను గురించి చెప్పుకునేవారు. ఏనిరుపేద ఇంట గంటకు మించిపాడినా, వాడిపేదరికం తీరిపోతుందని తెలిసికూడా– తన నియమం సడలించుకోనితుంబురుడు అహంకారిఅనీ, చపలచిత్తుడనీ చెప్పుకోసాగారు.

స్వీకారపురంలో సునాధుడనే పేదవాడున్నాడు. అతడికి సంగీతమంటే ఎంతో మక్కువ. ఎన్నో పర్యాయాలతడు తుంబురుణ్ణి అనుసరించి వెళ్ళి, ఏకాంతంలో ఆయన పాడుకునే పాటలను విని వస్తూండేవాడు. తుంబురుడిలాంటి సంగీత విద్వాంసుడు నభూతో నభవిష్యతి అని, అతడు ఎందరికో చెబుతూండే వాడు. అలాంటి విద్వాంసుణ్ణి అనుసరించి వెళ్ళాలి తప్ప, నాలుగు గోడలకూ పరిమితి చేయాలనుకోవడం అవివేకమూ, అన్యాయమూ అవుతుందని కూడా అతడు అనేవాడు.

ఇటీవల జనం తుంబురుణ్ణి అహంకారి అనీ, చపలుడనీఅనుకోవడం తెలిసి సునాధుడెంతో బాధపడి, ఒకసారివెళ్ళి, ఆయనను కలుసుకుని "మహానుభావా! మీదర్శనమే నాకు అద్భుతానుభవం. మీ వంటివాణ్ణి జనం అహంకారిఅనుకోవడం భరించలేకుండా వున్నాను. నా ఇంటికి వచ్చి పాటపాడి, మీపై అపవాదును తొలగించుకోవలసిందిగా కోరుతున్నాను," అన్నాడు.

తుంబురు డతడి వంక ఆప్యాయంగా చూసి, "ప్రజల పేదరికం తొలగించడం ప్రభువు బాధ్యత. ఆ బాధ్యతను కొందరు సంఘసేవకులు స్వీకరించినా తప్పులేదు. ఎవరైనా నన్ను అహంకారి అనుకుంటే, నేను చేయగలిగిందేమీలేదు. నేను నాకు చేతనైనదే చేయగలను, చేతగాని దాని కోసం అనవసర ప్రయత్నం చేయను. నీ ఇంట కూడా గంటకుమించి పాడలేను. అందుకిష్టమైతే నీ ఇంటికి రాగలను," అన్నాడు.

"తమకు చేతనైనది చేయగలనన్నారు. అదిచాలు నాకు," అన్నాడు సునాధుడు వినయంగా. తుంబురుడు పాటపాడడానికి సునాధుడింటికి వెళ్ళాడు.

సునాధుడు తనింటికి వేరేఎవర్నీ ఆహ్వానించలేదు. ఇంట్లో ఏ ఆర్భాటాలూ చేయలేదు. తుంబురుడికి ఉచితాసనం ఏర్పాటు చేశాడు. తనూ, కుటుంబం ఆయనఎదట కూర్చున్నారు.

తంబురుడుపాట ప్రారంభించాడు. శ్రోతలు పరవశించివినసాగారు. సరిగ్గాగంట కాగానే, తుంబురుడు పాట ఆపి, "గంట పూర్తయింది," అన్నాడు.

సునాధుడు వినయంగా, "అయ్యా! గంటపూర్తయిందికానీ, పాటపూర్తికాలేదు కదా! పాటనుపూర్తిచేయకుండా మధ్యలోనే ఆపడం న్యాయం కాదు," అన్నాడు.

తుంబురుడు అతడికేసి అబ్బురంగా చూసి, చిరునవ్వునవ్వి, తర్వాత ఏకధాటిగా మరొక రెండుగంటలసేపు పాడి, ఆఇంటి వారందర్నీ ఆనందింపజేశాడు.




చారులద్వారా ఈ సంగతి తెలుసుకున్న రాజు, సునాధుడికి, భాగ్యవంతులచేత రెండు లక్షలవరహాలు కానుకగా ఇప్పించడమేకాక, తనూ కానుకలిచ్చి సత్కరించాడు.

బేతాళుడు ఈకథచెప్పి, "రాజా, తుంబురుడి ప్రవర్తన ఏకరీతిగావున్నట్టు కనబడదు. రాజంతటి వాడు కోరినా ఆయన ఆస్థానంలో గంటకు మించి పాడడానికి నిరాకరించాడు. ఇది అహంకారం, చపలత్వం అని జనం అనుకున్నా లెక్కచేయలేదు. అటువంటివాడు సునాధుడింట గంటకు పైబడి ఎందుకు పాడాడు? సునాధుడు పేదవాడు గనక, అతడికి భాగ్యవంతుల చేత రెండులక్షలవరహాలు కానుకగా ఇప్పించేందుకా? ఇదే నిజమైతే, ఆయన రాజు దగ్గర అహంకారం, సునాధుడిదగ్గర చప

లత్వం ప్రదర్శించాడనుకోవలసి వస్తుంది కదా? ఈసందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీతల పగిలిపో తుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "తుంబురుడి ప్రవర్తన మొదటినుంచీ ఏకరీతిగానూ, సంగీతకళపట్ల ఆయనకున్న విశ్వాసాలకు అనుగుణంగానూ వున్నదనడంలో సందే హానికి తావులేదు. రాజాస్థానంలో ఆయన పాడడానికి వెళ్ళినప్పుడు, రాజు ఆయనను తను చేసిన ఏర్పాట్లలో ఏమైనా లోపా లుంటే చెప్పమన్నప్పుడు; అందుకాయన సంగీత విద్వాంసుడికి కావలసింది ఉత్తమ శ్రోత, అన్నాడు. అలాంటి ఉత్తమ శ్రోత నాయన, సునాధుడిలో చూడగలిగాడు. అంతకుముందు ఆయన ఒకగంటసేపు పాడి, గంటఅయింది అని పాడడం ఆపి నప్పుడు, మరొకగంటసేపు పాడమన్నవాళ్ళే తప్ప, పాటను మధ్యలో ఆపాడని ఎత్తి చూపినవాళ్ళులేరు. అంటే వాళ్ళు ఉత్తమ శ్రోతలుకారు; ఏదో మహావిద్వాంసుడు పాడుతున్నాడని చప్పట్లు చరిచి, అంతటితో సరిపెట్టుకునే వాళ్ళు. సునాధుడలాకాక, గంటపూర్తయినా, పాటపూర్తికాలేదు గదా- అని తుంబురుణ్ణి ప్రశ్నించిన ఉత్తమశ్రోత, సంగీత ప్రియుడు. అది గ్రహించడంవల్లనే, తుంబురుడు మరి రెండుగంటలకాలం పాడి, అతణ్ణి ఆనందింపచేశాడు. ఇక, పేదవాడైన సునాధుడికి భాగ్యవంతులచేత రెండులక్షలవరహాల బహూకృతిఇప్పించే విషయానికివస్తే- ఇలాంటి లౌకిక వ్యవ హారాలపట్ల ఆయనకున్న విశ్వాసం ఎలాం టిదో, ఆయన మాటల ద్వారానే తెలుసుకో వచ్చు. తను పేదల ఇళ్ళల్లో గంటకు మించిపాటపాడి, వాళ్ళందరికీలక్షలిప్పించి, వాళ్ళ పేదరికాన్ని తొలగించ చూడడం వెర్రితనమనిపించుకుంటుంది. అందుకే, ప్రజల పేదరికం తొలగించడం ప్రభువు బాధ్యత, అన్నాడాయన. ఇదంతా తరచి చూసినప్పుడు తుంబురుడు నిస్సందేహంగా ఏమాత్రం అహంభావీ, చపలుడూ కాదని అర్థమవుతుంది," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహామాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)

[ఆధారం: "వసుంధర" రచన]





# ఎత్తుపై ఎత్తు

మరాళదేశపు రాజనర్తకికి కాలుబెణికింది. పదిరోజులుగా ఆమె ఆస్థానానికి రాలేదు. రాజవైద్యుడి మందులు పట్టివ్వడంలేదు. రోజంతా రాజరికపు పనిభారంతో సతమతమయ్యే రాజుగారు, సాయంత్రం ఆమె నాట్యం చూసి సేద తేరుతూండేవాడు. దైనందిన కార్యక్రమంలో ఎంత చిన్న తేడా వచ్చినా ఆయనకు మనశ్శాంతి దూరమవుతుంది.

క్రమంగా రాజుగారు రాచకార్యాలపైదృష్టి నిలపలేకపోవడం చూసి మంత్రి కళవెళపడ్డాడు. రాజుగారు అంతగా రాజనర్తకి నాట్యానికి బానిస కావడం, ఆయనను ఆశ్చర్యపరిచింది.

మంత్రి, రాజనర్తకి ఆరోగ్య పరిస్థితి ఎలా వున్నదీ స్వయంగా తెలుసుకుందామని, ఆమె మందిరానికి బయల్దేరాడు. ఆయన మందిరంలోకి అడుగుపెడుతూండగానే లోపలమాటలు వినిపించి, గుమ్మంలోనే ఆగిపోయాడు.

రాజనర్తకి, తల్లితో, "చూశావా, అమ్మా! కాలుబెణికిందనే వంకతో, పదిరోజులపాటు నాట్యం మానేస్తే, రాజుగారికి నా విలువ బాగా తెలిసొచ్చింది. నాకు అందిన సమాచారం ప్రకారం - రాజుగారీ రోజు సభక్కూడా వెళ్ళకుండా, తన విశ్రాంతి మందిరంలోనే ఉండిపోయారు. మరొక వారంరోజులపాటు ఇలా ఇంట ఉన్నానంటే నేకోరినది తప్పకయిచ్చి తీరుతారు. చెప్పొగదా, నాకొక చిన్నసంస్థానానికి జమీందారిణీని కావాలని వున్నది," అంటున్నది.

అందుకు నర్తకితల్లి, "ఏమోనే - అమ్మాయ్! నేనూ వయసుల్లో వుండగా అక్కడా ఇక్కడా రాజాస్థానాల్లో నాట్యం చేసిన దాన్నే. మెచ్చి, ప్రభువులు ఏమిస్తే అది తీసుకుని సంతోషించేదాన్ని. నేనే

ఇంద్రగంటి నరసింహమూర్తి

కాదు, చాలామంది నాట్యకత్తెలు అలాగే చేసేవారు. మా తరం గడిచిపోయింది. మీ తరం వాళ్ళకు కళమీదికంటే, ధనకన కాలమీద ఎక్కువ ప్రీతిలాగుంది!" అంటూ ఉస్సురుమన్నది.

ఆమాటలువిన్నమంత్రిసంగతిగ్రహించి, అటునుంచి అటే వెనుదిరిగి, రాజుగారి విశ్రాంతి మందిరానికి వెళ్ళి, "మహారాజా! రాజనర్తకిని పరిశీలించిన వైద్యులు, ఆమె కనీసం మరి రెండు, మూడు వారాలపాటు నాట్యం చేయగల స్థితిలో వుండదని చెపుతున్నారు. అందుకే సాయంవేళల్లో, మీ ఆనందానికీ, మనోల్లాసానికీ మరొక ఏర్పాటు చేశాను," అంటూ వెళ్ళి, గదిలో ఒకమూల నున్న చదరంగం బల్ల తెచ్చి, ఆయన ముందు పరిచాడు.

"ఈ ఆట నాకు చేతకాదు గదా!" అన్నాడు రాజు నిరుత్సాహంగా.

"నేను నేర్పుతాను, మహారాజా! ప్రయత్నిస్తే నేర్వలేని విద్యేముంటుంది? మీవంటి మహారాజులు ఆడవలసిన ఆట ఇది. ఎత్తులుపైఎత్తులు! మనిషి మేధకు మరింత శక్తి, వన్నెతెచ్చే ఆటఇది!" అంటూ మంత్రి, రాజుగారికి ఆసక్తికరంగా చదరంగం ఆటలోని మెళకువలన్నీ వివరించాడు.

నాలుగు రోజులు గడిచేసరికి, రాజుగారికి ఈ చదరంగం ఆట అద్భుతమనిపించింది. మరొకవారం తిరిగేసరికి, ఆయనే మంత్రిని, "రండి, రండి, మహామంత్రీ! ఒక ఎత్తు వేద్దాం," అంటూ చదరంగం బల్లముందు కూర్చోసాగాడు.

ఇలా నెలరోజులు గడిచిపోయినై. రాజుగారు ఒకనాడు మంత్రితో, "మహామంత్రీ! రోజంతా రాచకార్యాలతో సతమతమవుతూ, సాయం సమయాల్లో మెదడు పదునెక్కించే, ఇలాంటి చదరంగం ఆడుకునే మనకు, ఆ నర్తకి బెడద ఎందుకు? ఆమెకు తగిన బహుమానంఇచ్చి, ఆస్థానం నుంచి పంపెయ్యండి!" అన్నాడు.

ఈ సంగతి విన్న రాజనర్తకి తల్లి విచారంగా, కూతురుతో, "నేను ముందే హెచ్చరించాను. ఎంతో గౌరవంగా బతికే ఈ రాజాస్థానం విడిచి, మరేదైనా రాజాస్థానంలో నర్తకి పదవికోసం వెతుక్కోవాలి! ఈ దుర్దశకు కారణం, నీ పొగరుబోతుతనం!" అన్నది.



# పచ్చల దీవులలో

రచన: మీరానాయర్ ♦ చిత్రాలు: గౌతమ్‌సేన్




**అ**ండమాన్ దీవులను **ఉత్తర అండమాన్, మధ్య అండమాన్, దక్షిణ అండమాన్, లిటిల్ అండమాన్** అని నాలుగు ముఖ్యమైన భాగాలుగా చెప్పుకుంటారు.

ఉత్తర అండమాన్ సమీపంలోనే బారెన్, నార్కొండామ్ అనే జనసంచారం లేని దీవులు ఉన్నాయి. ఇవి అగ్నిపర్వతాలు బద్దలవడం వల్ల ఏర్పడ్డాయి. బారెన్ దీవిని అండమానువాసులు 'మోలాటార్చోనా' అంటే 'పొగదీవి' అని అంటారు. సముద్ర మధ్యంనుంచి 608 మీ॥ ఎత్తుకు హఠాత్తుగా జ్వలించే అగ్నిపర్వతం ఒక్కటే సజీవమైనది. దాదాపు 200 సంవత్సరాల విరామం తరవాత అది 1991వ సం॥లో బద్దలయింది. నార్కొండామ్‌ను ఏర్పరచిన అగ్నిపర్వతం చల్లారిపోయింది.

అండమాన్ దీవుల రాజధాని **పోర్ట్‌బ్లాయిర్** దక్షిణ అండమాన్‌లో ఉన్నది. ఇక్కడ విమానాశ్రయం కూడా ఉన్నది. పోర్ట్‌బ్లాయిర్ సమీపంలో వున్న హాడో హార్బరుకులోకి వచ్చే ఓడలలోని ప్రయాణీకులను సముద్రంలో ఎగిరిపడే డాల్ఫిన్స్ తమ చిత్రమైన చేష్టలతో అలరిస్తాయి.

ఆర్కిబాల్డ్ బ్లాయిర్ అనే బ్రిటిష్ సర్వేయర్ 1789వ సం॥లో ఈస్టిండియా కంపెనీ దిగడానికి సరైన స్థావరంగా ఈ స్థలాన్ని ఎంపిక చేశాడు. ఆయన పేరు మీదుగానే ఈ పట్టణానికి పోర్ట్ బ్లాయిర్ అనే పేరు పెట్టారు.

రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో అంటే 1942వ సం॥ ప్రాంతంలో జపాన్ వాళ్ళు ఈ దీవిని పట్టుకున్నారు. వాళ్ళు తమ స్వల్ప పరిపాలనా కాలంలో సముద్ర తీరంలో నిర్మించిన సిమెంటు 'బంకర్లు' ఇంకా ఉన్నాయి. ఆ కాలంలో జపాన్ నుంచి తీసుకువచ్చిన ఫలాలు, పంటలు అండమాన్స్‌లో వ్యాపించి ఇంకా కొనసాగుతున్నాయి. ఈనాటికీ జపాను భాషను సరళంగా మాట్లాడే స్థానికులు పలువురు ఉన్నారు.

వీర్ సావర్కార్

వినాయక్ సావర్కార్, ఆయన సోదరుడు గణేష్ సావర్కార్ మొదలైన విప్లవనాయకులను సెల్యులార్ జైలులో బంధించారు.



స్వతంత్రం పొందాక మనదేశం నుంచి చాలామంది పోర్ట్ బ్లాయిర్‌కు వలసవెళ్ళి అక్కడే స్థిరపడ్డారు. అటువంటి వారిలో బెంగాలీలు ప్రథమ స్థానంలోనూ, తమిళులు రెండవ స్థానంలోనూ ఉన్నారు.

పోర్ట్ బ్లాయిర్ అనగానే గుర్తుకువచ్చేది అక్కడున్న సెల్యులార్ జెయిలు. ఇక్కడ 698 చిన్న చిన్న గదులతో ఒకపెద్ద జైలు ఉన్నది. అందులో ఒక్కటి కూడా పడక సదుపాయం గల విశాలమైన గదిలేదు.

ఈ జైలును 1886వ సం॥లోనూ, 1906వ సం॥లోనూ నేరస్థులను బంధించడానికి బ్రిటిష్ వాళ్ళు నిర్మించారు. ఆ తరవాత వాటిని స్వతంత్ర యోధులనూ, విప్లవవీరులనూ బంధించడానికి ఉపయోగించారు. ఈనాడు అదొక జాతీయ స్మారక చిహ్నంగా ఉంటున్నది.

పోర్ట్ బ్లాయిర్‌లోని 'చాత్తమ్ సామిల్స్' ఆసియా ఖండంలోనే అతి ప్రాచీనమైన 'సామిల్లు'గా ప్రసిద్ధిగాంచింది. హాడో పట్టణంలోని ఈ సామిల్లు షోరూమ్‌లో ప్రపంచంలోని అత్యుత్తమమైన కలప చెక్కలు లభ్యమవుతున్నాయి.

ఒకప్పుడు బ్రిటిష్ పరిపాలనా కేంద్రమైన **రాస్ఐలండ్,** పోర్ట్ బ్లాయిర్‌కు కొన్ని కి.మీ. దూరంలో ఉన్నది. ఒకప్పుడది భూకంపానికి లోనవడంతో ప్రజలు ఆ దీవిని వదిలిపెట్టారు.

**'చిరియా టాపు'** (పక్షులదీవి) పోర్ట్‌బ్లాయిర్‌కు 26. కి.మీ. దూరంలో ఉన్నది. ఇది రకరకాల పక్షులకు నిలయంగా పర్యాటకులను అలరిస్తుంది. ఈ దీవిలో 'స్విఫలెట్ గూళ్ళు' చాలా ఉన్నాయి. వీటిని సేకరించడానికి బర్మావంటి దేశాలనుంచి కూడా వస్తూంటారు. అయితే, వాళ్ళు ఈ గూళ్ళతో పాటు ఇక్కడి స్థానికులను కూడా పట్టుకుపోయి బానిసలుగా విక్రయించేవారు. అందువల్ల కొత్తవాళ్ళను చూడగానే ఇక్కడి వారు హడలిపోయి హాని తలపెట్టడానికి పూనుకుంటారు.

ఓంజెస్ తెగ ప్రజలు









స్థానికులలో **జారవాలు, సెంటినిలీస్** అనే ఆటవిక తెగలవాళ్ళు ముఖ్యులు. జారవాలు దక్షిణ, మధ్య అండమాన్స్‌లో దాదాపు 200 మంది ఉన్నారు. రాతియుగపుమానవుల్లాగా వాళ్ళు ఇంకా వేటయే ప్రధాన వృత్తిగా జీవిస్తున్నారు. సెంటినిలిస్, ఉత్తర సెంటినల్ ఐలండులో నివసిస్తున్నారు. కొత్తవాళ్ళ నెవరినీ వాళ్ళు తమ దరిదాపులకు రానివ్వరు. ప్రపంచంలో ఈనాడు మానవ సమాజానికి దూరంగా మరీ ఏకాకులుగా జీవిస్తున్న తెగలలో వీళ్ళూ ఒకరు.

**లిటిల్ అండమాన్స్**‌లోని దుగాంగ్ క్రీక్‌లో నశించిపోతూన్న ఓంజెస్ తెగకు చెందిన వాళ్ళున్నారు. స్త్రీ పురుషులిరువురూ తలలు బోడులు చేయించుకుని, ముఖాన్నీ, శరీరాన్నీ, బంకమన్నుతో అలంకరించుకుంటారు. పీతల కాళ్ళతో తయారుచేసిన గొట్టాలతో పొగపీల్చడానికి వీళ్ళెంతో ఇష్టపడతారు.

ఇప్పుడు అండమాన్ స్థానికులు చాలా వరకు సంచార జీవనం వదిలిపెట్టి వ్యవసాయం చేసుకుంటున్నారు.

జారవాలు, సెంటీనిలీస్, ఓంజెస్, అండమాన్స్ ముఖ్యమైన ఈ నాలుగు తెగల ప్రజలూ నెగ్రిటో జాతికి చెందినవారు.

అండమాన్ దీవులను, నికోబార్ దీవుల

పనిచేసుకుంటూన్న ఆదిమ తెగ మనిషి.



నుంచి 'టెన్ డిగ్రీ చానెల్' అనే చాలా ఉధృతమైన కాలువ విడదీస్తున్నది. అండమాన్, నికోబార్ దీవుల మధ్య దూరం కేవలం 195 కి.మీ. మాత్రమే. అయితే వీటి మధ్య సాంస్కృతికంగా ఎటువంటి సామ్యమూ కనిపించదు. మొత్తం 19 దీవులలో 12 దీవులలో మాత్రమే ప్రజలు నివసిస్తున్నారు. నికోబార్ దీవులలో చాలా పెద్దది గ్రేట్ నికోబార్. నాన్‌కారీ దీవి చాలా అభివృద్ధి చెందినది. అధిక జనసాంద్రత కలిగిన దీవి **కార్ నికోబార్.**



షాంపెన్ తల్లీ బిడ్డలు

చిన్న చిన్న కొండలతో నిండిన కార్ నికోబార్ దీవిలో మంగోలాయిడ్ జాతికి చెందిన నికోబారీ, షాంపెన్స్ తెగల ప్రజలు నివసిస్తున్నారు. దిబ్బలమీద గుంజలతో నిర్మించుకున్న గుమ్మటం లాంటి గుడిసెలలో వీళ్ళు నివసిస్తారు. నిచ్చెనల సాయంతో ఇళ్ళల్లోకి వెళతారు.

దక్షిణ ప్రాంతంలో వున్న గ్రేట్‌నికోబార్‌లోని దట్టమైన అడవులలో షాంపెన్స్ నివసిస్తున్నారు. వీళ్ళకు తేనె అంటే మహా ఇష్టం. తేనెటీగల బారికి గురికాకుండా తేనె సేకరించడంలో వీళ్ళు సిద్ధహస్తులు. ఒకరకం మొక్క ఆకులను నోట్లో వేసుకుని బాగా నమిలి వాటి రసాన్ని ముఖానికీ చేతులకూ పూసుకుని తేనె తుట్టెల దగ్గరికి వెళతారు. ఆ తరవాత తేనె టీగలు వాళ్ళనేమీ చేయవు.

గ్రేట్ నికోబార్ పశ్చిమ తీరంలో మేగాపోడ్ అనే చిన్నదీవి ఉన్నది. మేగాపోడ్ పక్షులు ఎక్కువగా ఉండడం వల్ల దానికాపేరు వచ్చింది.

నికోబార్ దీవుల దక్షిణాగ్ర బిందువును **సిగ్మాలియన్** పాయింట్ అనీ **ఇందిరా పాయింట్** అనీ అంటారు. ఇండోనేసియా దీవి సుమత్రాకు ఇది 150 కి.మీ. దూరంలో ఉన్నది. ఈ దీవుల సమూహానికే కాకుండా ఇది భారత దేశానికే దక్షిణాగ్ర బిందువు. మన సముద్రతీర ప్రయాణం కూడా ఇంతటితో పూర్తవుతుంది.

మేగాపోడ్ పక్షి



సముద్రతీర ప్రయాణాల తరవాత ఇప్పుడు ఆసక్తికరమైన నదీతీర ప్రయాణాలకు సిద్ధమవుదాం. మన ప్రయాణం దక్షిణ భారతదేశంలోని కావేరీ తీరం నుంచి మొదలు పెడదాం. వచ్చే సంచిక నుంచి 'మనదేశపు నదులు' శీర్షికలో 'కావేరీ యాత్ర' ప్రారంభమవుతుంది.




# విశాలుడి మతిమరుపు

పెనుమూడి అనే గ్రామంలోవుండే జగన్నాధానికి నలుగురుకొడుకులు. వారిలో ఆఖరువాడు విశాలుడు, పెద్దవాళ్ళు ముగ్గురూ కష్టపడి చదువుకుని, జీవితంలో స్థిరపడ్డారు. విశాలుడికి చదువు సరిగ్గా అబ్బలేదు. అందుక్కారణం వాడి మతిమరుపు.

ఏమిచదివినా వెంటనే మర్చిపోవడం విశాలుడి సహజగుణం. చదువే కాదు, అన్ని విషయాల్లోనూ వాడి మతిమరుపు అలాగే వుండేది. స్నేహితులతో ఆటలాడితే దొంగ ఎవరో మర్చిపోయేవాడు. ఆటల గొడవలో తిండిగురించి మర్చిపోయేవాడు. తిండి తిన్నాక ఆ విషయం మర్చిపోయేవాడు. పొరపాటున తల్లి మళ్ళీ పిలిస్తే, మళ్ళీ వెళ్ళి భోజనం చేసేవాడు. డబ్బులిచ్చి సంతకుపంపిస్తే, ఏమికొనాలో మర్చిపోయేవాడు. తోచినవి కొనితెచ్చి, ఏవి ఎంతక్కొన్నాడో మరిచేవాడు.

తల్లిదండ్రులకు విశాలుడి మతిమరుపు గురించి బెంగగావుండేది. వాళ్ళు వాడిని దగ్గరుండి శ్రద్ధగా చదివించారు. జ్ఞాపకశక్తి వృద్ధిపొందలేదు. తలకు నిమ్మనూనె మర్దన కూడా చేయించారు. మతిమరుపు పోలేదు. సరస్వతీలేహ్యం తినిపించారు. వాడిలో ఏవిధమైన మార్పులేదు.

ఈవిధంగా, విశాలుడికి పదిహేను నిండాయి. తల్లిదండ్రులకు వాడి స్థితి చూసి మరింత బెంగపట్టుకున్నది. విశాలుడి అన్నలు మంచివాళ్ళు. వాళ్ళు తల్లి దండ్రులతో, "మేము సుఖంగా వుంటున్నాం. మనకున్న ఇరవై ఎకరాల ఆస్తి విశాలుడికే ఇచ్చేస్తాం. అందులో ఒక్క ఎకరం కూడా వాటా అడక్కుండా, మేము స్వయంకృషితో బ్రతుకుతాం. మీరు దిగులు పడకండి!" అని ధైర్యం చెప్పారు.

జొన్నలగడ్డ రామలక్ష్మి



అయితే, విశాలుడి తల్లిదండ్రులు మాత్రం, "మతిమరుపు మనిషికి ఎంత ఆస్తివుంటే మాత్రం, ఏంలాభం? వాడిని మోసగించడం సులభం. మేమున్నంత కాలం ఫర్వాలేదుకానీ, ఆ తర్వాత మీరు మాత్రం ఎంతకాలమని వాడి బాగోగులు చూస్తారు? మీసంసారాలు పెద్దవవుతాయి. ఎదిగిన పిల్లలు ఎవరి బ్రతుకులు వాళ్ళు బ్రతకాలితప్ప, ఇతరులమీద ఆధారపడ కూడదు," అని పెద్ద కొడుకులవద్ద కళ్ళ నీళ్ళు పెట్టుకునేవారు.

ఇలావుండగా – ఆ గ్రామానికి యోగి ఒకడు వచ్చాడు. ఆయన ఎటువంటి సమస్యనైనా పరిష్కరించగలడని తెలిసి, విశాలుడి తల్లిదండ్రులాయనను దర్శించి, విశాలుడి గురించి చెప్పుకున్నారు.

"అబ్బాయి నొకసారి నావద్దకు తీసుకు రండి. వాడి మతిమరుపు తగ్గించే ఉపాయ ముందో లేదో పరిశీలించి చెబుతాను," అన్నాడు యోగి.

మర్నాడు విశాలుడు, తల్లిదండ్రులతో యోగివద్దకు వెళ్ళాడు. యోగి, విశాలుణ్ణి వెంటబెట్టుకుని, సమీపంలో వున్న ఒక పూలమొక్కవద్దకు వెళ్ళాడు. ఆ మొక్కకు పసుపురంగు పూలున్నాయి. కొమ్మలన్నీ ముళ్ళతో నిండివున్నాయి.

యోగి, విశాలుడితో, "మొత్తం పన్నెండు పూలుకోయి. ముళ్ళుగీరుకోకుండా జాగ్రత్త పడు. నీ మతిమరుపు తగ్గడానికి మంచి మందు చెబుతాను," అన్నాడు.

విశాలుడు ఎనిమిది పూలుకోసి తెచ్చి యోగికిచ్చాడు. ఆయన ఎన్నిపూలు కోయ మన్నదీ వాడు మర్చిపోయాడు. జాగ్రత్తగా కోయకపోవడం వల్ల, వాడి చేతివేళ్ళకు ముళ్ళుగీసుకుని కొద్దిగా రక్తం వచ్చింది.

"అయ్యో, ముళ్ళుగీసుకున్నాయా? నేను చెప్పినా నువ్వు జాగ్రత్త తీసుకోక, పెద్ద ప్రమాదంలో ఇరుక్కున్నావు. ఈ మొక్క ముళ్ళకు కొసల్లో విషముంటుంది. అయితే, అది వెంటనే తన ప్రభావం చూపించదు. సరైన వైద్యం జరక్కపోతే, ఏడాదిలోపల ఏచిన్న జబ్బుచేసినా, నీ ప్రాణం పోతుంది," అన్నాడు యోగి.

విశాలుడు కలవరపడి, "ఈ విషయం తమరు నాకు ముందే చెప్పాల్సింది. మరి కాస్త జాగ్రత్తపడే వాడిని. అయినా నేను మతిమరుపు మనిషినని తెలిసుండీ, నా చేత పూలెందుకుకోయించారు?" అన్నాడు.

యోగి చిన్నగా నవ్వి, "అవన్నీ ఇప్పుడ నవసరం. నేను నీకు పదిగుళికలిస్తాను. ప్రతిరోజూ రెండుపూటలా భోజనంకాగానే, ఒక్కొక్క గుళిక చొప్పున వేసుకోవాలి. ఇప్పుడు ఎనిమిది పూలు కోశావు గదా, వీటిని సాయంత్రం శివుడి గుడిలో ఇవ్వు. ఇలాగే మొత్తం అయిదురోజులు, రోజూ ఎనిమిది పూలచొప్పున సాయంత్రాలు శివుడిగుడిలో ఇస్తూండు. ఇంకెప్పుడూ చేతికి ముళ్ళు గీరుకోకుండా జాగ్రత్తపడు. ఒకవేళ గీరుకుంటే, వెంటనే వచ్చి నాకు చెప్పు. అందుకు విరుగుడు చాలా కష్టం," అన్నాడు.

"స్వామీ! నేనసలే మతిమరుపు మనిషిని. ఇవన్నీ మాఅమ్మకు చెప్పండి,ఆమె చూసుకుంటుంది," అన్నాడు విశాలుడు.

యోగి అయిష్టంగా తలాడించి, "ఈ విషయం నీకూనాకూతప్ప, మూడో మనిషికి తెలిస్తే, వైద్యవిధానం పని చెయ్యదు. అన్నీ నువ్వే స్వయంగా చేసుకోవాలి. మరొకసారి నువ్వేం చేయాలో చెబుతాను. ఆ తర్వాత ఏం చేయాలని నువ్వు కూడా అడక్కూడదు, గుర్తుంచుకో!" అన్నాడు.

తర్వాత, ఆయన విశాలుణ్ణి వాడి తల్లిదండ్రులకు అప్పగించాడు. వాళ్ళు వెళ్ళిపోయారు.

ఆరోజుతో కలిపి సరిగ్గా అయిదురోజుల య్యాక విశాలుడు, తల్లిదండ్రులను వెంటబెట్టుకుని వచ్చి, "స్వామీ! మీరు చెప్పినవన్నీ ఒక్కటికూడా పొల్లుపోకుండా చేశాను. ఇంకా ఏమిచేయవలసివుందో చెప్పి, నా భయాన్ని తగ్గించండి," అన్నాడు.



"ఇకఅందరికీతెలిసినాఫర్వాలేదు.నువ్వేం చేశావో, అన్నీ చెప్పు," అన్నాడు యోగి.

"ప్రతిరోజూ రెండుసార్లు భోజనం చేయగానే, మీరిచ్చిన గుళికలు వేసుకునేవాణ్ణి. అలా మొత్తం అయిదు రోజులూ చేశాను. రోజుకు ఎనిమిది చొప్పున పూలుకోసి, సాయంత్రాలు శివుడి గుడిలోయిస్తూ వచ్చాను. ఒక్కసారికూడాచేతులకు ముళ్ళు గీరుకోనివ్వలేదు," అన్నాడు విశాలుడు.

"ఆహా! అయిదు రోజుల క్రితం, రెండంటే రెండేసార్లు చెప్పిన విషయాలను ఇంత బాగా గుర్తుంచుకుని అమలుపరిచాడు. మీ విశాలుడి మతిమరుపు పోయినట్టే గదా!" అన్నాడు యోగి.

విశాలుడి తల్లిదండ్రులాశ్చర్యపడి, "తమరు చెప్పింది నిజమే! ఏం గుళికలి

చ్చారోకానీ, వాటిమహిమ వాడి మెదడుపై అద్భుతంగా ప్రభావం చూపింది," అన్నారు.

యోగినవ్వి, "ఇందులో నా గుళికల ప్రభావం ఏమీలేదు. అసలుతప్పంతామీలో వుంది. అందువల్లనే విశాలుడిలా తయారయ్యాడు," అన్నాడు.

తర్వాత విశాలుడి తల్లిదండ్రులకు అర్థంకావడానికి, ఆయన అసలు విషయాన్ని ఇలా వివరించాడు: "భగవంతుడు మనుషులందరికీ సమంగానేబుద్ధిని ప్రసాదించినా, కొందరు బద్ధకస్తులు దాన్ని సక్రమంగా ఉపయోగించక, అన్నింటికీ ఇతరులమీదనే ఆధారపడతారు. లేత వయసులో, ఆ బద్ధకం వల్ల కలిగే హాని వారికి తెలియదు. ఆ వయసులో అన్నీ నిర్లక్ష్యం చేసి, అందుకు పెద్దయ్యాక విచారిస్తారు.

"విశాలుడు తెలివైనవాడే కానీ బద్ధకస్తుడు. అందుకని మతిమరుపు అలవాటు చేసుకున్నాడు. మతిమరుపువాడికెవరూ ఏపనీ చెప్పరు. మతిమరుపువాణ్ణి ఎవ్వరూ తప్పుపట్టరు. స్నేహితులు ఆటల్లో వాడిమీద జాలిపడుతున్నారు. ఆటల్లో ఓడిపోవడం వల్ల, వాడికేంనష్టం అనిపించదు. అలాగే వాడికే అవసరాలున్నా అన్నలో, తండ్రో చూసుకుంటున్నారు. తల్లి వాడికి పిలిచి భోజనం పెడుతున్నది. మతిమరుపు తన ప్రాణాలు తీయవచ్చునని భయంకలగ్గానే, వాడి జ్ఞాపకశక్తి అద్భుతంగా పనిచేసింది.

"వాడిబుద్ధిలో లోపముందా?లేకబద్ధకం, నిర్లక్ష్యంతో మతిమరుపును కొనితెచ్చుకుంటున్నాడా, అన్నది పరీక్షించడానికే, నేను ఈఅయిదురోజులు వాడిలోప్రాణభయాన్ని కలిగించాను. వాడికి జ్ఞాపకశక్తి లోపం లేదని తెలిసిందికాబట్టి, ఇకమీదట మతిమరుపు తొలగకపోతే, విశాలుడి వాటా మూడెకరాలపొలం కూడా, ముగ్గురన్నదమ్ములకూ ఇచ్చేసి, వీణ్ణి వాళ్ళ దయాధర్మ భిక్షంపై ఆధారపడి బ్రతకమనండి తప్ప- మొత్తం ఆస్తిఅంతా వీడికే ఇచ్చే పొరబాటు ఆలోచన చేయవద్దు."

"నావాటామూడెకరాలేమిటి? అయిదెకరాలుకదా!" అన్నాడు విశాలుడప్రయత్నంగా.

యోగి చిటికెలువేస్తూ నవ్వి, విశాలుడి తల్లిదండ్రులతో, "మీ విశాలుడికి మీఆస్తి ఎంతో, అందులో తన వాటా ఎంతో కూడా స్పష్టంగాగుర్తుంది.గమనించారా?" అన్నాడు.

ఆ తర్వాత విశాలుడిని మతిమరుపు బాధించలేదు.



అంగ్లేయులను ఎదిరించిన యోధులు

5

# పళస్సీరాజా కేరళవర్మ

రచన: మీరా ఉగ్రా * చిత్రాలు: గౌతమ్‌సేన్

కేరళవర్మగా ప్రసిద్ధిగాంచిన పళస్సీరాజా కోట్టయం సంస్థానాధిపతుల వంశానికి చెందిన పాలకుడు. 1799వ సం॥లో విచారకరమైన వార్త ఒకటి రాజధాని పళస్సీకి అందింది.













1802 అక్టోబర్‌లో ఎడచెన్నకుంగాన్ నాయర్ నాయకత్వంలో పనమరంకోటను ముట్టడించారు.


ఆ తరవాత నాయర్ పుల్‌పాళ్ దేవాలయం వద్ద చేరి ప్రజలకు పిలుపునిచ్చాడు.
భూమి పుత్రులారా! రండి! ఏకం కండి! ఎక్కడినుంచో వచ్చి మనపై అధికారం చెలాయిస్తూన్న పర దేశీయులను తరుమగొట్టండి!


ఆయన పిలుపునందుకుని దాదాపు 3,000 మంది వచ్చారు. ఆ తరవాత ఎడచెన్ననాయర్ మైసూర్- మనన్టోడీ మార్గాన్నంతటినీ పట్టుకున్నాడు. ఇది బ్రిటిష్ వారిని కలవరపెట్టింది.
మనం పూరిగా విడదీయబడ్డాం. ఎటువంటి సరఫరాలూలేవు. సైనికదళాలూ రావడం లేదు.


... అవును. దూరప్రాంతాల నుంచి వచ్చే సైనిక దళాలకు అడ్డుపడే ప్రమాదం వుంది. కాబట్టి మనం ఇక్కడే స్థానికులతో సాయుధ పోలీసు దళాలను ఏర్పాటు చేసుకోవాలి.


1800 సెప్టెంబర్‌లో లెఫ్టినెంట్ కల్నల్ కీర్క్ పాట్రిక్ పై అధికారులకు ఇలా తెలియజేశాడు-
ఈ విషయంలో మనం ఎదుర్కొంటూన్న అతి జటిల సమస్య పళస్సిరాజా వ్యతిరేకత! అతన్ని ఓడించామంటే మిగిలిన వన్నీ సర్దుకుంటాయి.... మనాథనాలో రాజా బలగం పెరగిపోతున్నది!...


1801 మే నెలలో కల్నల్ స్టీవెన్‌సన్ నాయకత్వంలో పెద్దసైన్యం వైనాడు కోటను ముట్టడించాయి.
వాళ్ళు కోటను ముట్టడించారు. మనం వెంటనే కోటను ఖాళీచేయాలి.


రాజా, ఆయన అనుచరులు చిరక్కాల్ అడవులలో తలదాచుకున్నారు.
ఎడచెన్నా! ఐదేళ్ళక్రితంలాగా మనం మళ్ళీ వాళ్ళను ఓడించగలం!


ఉభయ పక్షాలకూ మధ్య ఘర్షణలు కొనసాగాయి. కొన్ని నెలల తరవాత కంపెనీ సేనలు శంకరన్ నాయర్‌నూ, ఆయన కుమారుణ్ణీ పట్టుకుని ఉరితీశాయి.

కల్నల్ మెక్లాడ్ నాయకత్వంలో కోల్కార్స్ అనే నూతన పోలీసుదళాలు నైపుణ్యాన్ని పెంచుకున్నాయి. పళస్సీరాజా, అనేక యుద్ధాలలో ఓటమిని ఎదుర్కోవలసి వచ్చింది. దళనాయకులు పట్టుబడి హతులయ్యారు. ఆఖరుగా 1805 నవంబర్ 30వ తేదీ థామస్ హార్వీబేబర్, కేప్టన్ క్లాఫమ్ పళస్సీరాజా కోసం అడవులలో గాలింపు చర్యలకు దిగారు.










రాజా, తన వేలి వజ్రపుటుంగరాన్ని తీసి మింగేశాడు!



మరునాడు ఆయన భౌతికకాయానికి రాజలాంఛనాలతో అంత్యక్రియలు జరిగాయి. కేరళ ప్రథమస్వాతంత్ర్య సమర యోధుణ్ణి క్లాఫిన్లూ, బేబర్, కంపెనీ అధికారులకు నివేదికను పంపాడు.





# మహాభారతం

కృష్ణుడు ద్వారకకు బయలుదేరి వెళ్ళి పోగానే ఉపప్లావ్యంలో ధర్మరాజూ, విరాటుడూ, ఇతర రాజులూ యుద్ధప్రయత్నాలు ప్రారంభించారు. మంత్రి, బంధు, మిత్రులతో వెంటనేబయలుదేరి రమ్మని అందరు రాజులకూ విరాటుడూ, ద్రుపదుడూ కలిసి వార్తలు పంపారు. అలా వార్తలు అందిన రాజులు, పాండవుల మీది ప్రేమచేతనైతేనేమి, విరాట ద్రుపదులపట్ల గల గౌరవం చేతనైతేనేమి, ఉపప్లావ్యానికి రాసాగారు.

ఇక్కడ యుద్ధయత్నాలు సాగుతున్నట్టు తెలియగానే ధృతరాష్ట్రుడి కొడుకులు కూడా తమ తమ మిత్రులను పిలిపించనారంభించారు. ఈవిధంగా, రానున్న కురుపాండవ యుద్ధానికిగాను దేశాలన్నిటా సంచలనం కలిగింది. పెద్ద పెద్ద సేనల నడకతో భూమి అదిరిపోయింది.

ఈ లోపల ద్రుపదుడు తన పురోహితుణ్ణి కౌరవుల వద్దకు రాయబారం పంపబోతూ, “నువ్వు ప్రజ్ఞావంతుడవు. ధృతరాష్ట్రుడు ఎలాటివాడో, ధర్మరాజు ఎలాటివాడో నీకు బాగా తెలుసు. కౌరవులు పాండవులను ఎలా మోసం చేశారో ధృతరాష్ట్రుడు ఎరుగును. విదురుడు వద్దంటున్నా వినక, తన కొడుకు కోరాడని ఆయన ధర్మరాజును జూదం ఆడటానికి పిలిపించాడు. వాళ్ళు ఇప్పుడు పాండవులకు రాజ్యం ఇవ్వకుండా ఉండటానికే నిశ్చయించుకుని ఉన్నారు. నువ్వు ధృతరాష్ట్రుడితో ధర్మం చెప్పు. విదురుడు నీకు సహాయంగా మాట్లాడతాడు. నువ్వు పాండవుల మంచితనమూ, దుర్యోధనుడి చెడ్డతనమూ నొక్కి చెప్పినట్టయితే వారిపక్షం వారు అధర్మం కోసం యుద్ధం చెయ్యటానికి వెనకాడుతారు. వారిలో ఈ విధంగా చీలిక తీసుకు

## 44. యుద్ధ ప్రయత్నాలు



రావటమే నీ ప్రధాన కర్తవ్యం. దుర్యోధనా దులవల్ల నీకు ఎలాటిభయమూఉండదు. నువ్వు దూతవేగాక, వయసులో చాలాపెద్ద వాడివి," అని హెచ్చరించాడు.

ద్రుపదుడి పురోహితుడు తన శిష్య గణాన్ని వెంటబెట్టుకుని హస్తినాపురానికి బయలుదేరి వెళ్ళాడు.

తరవాత పాండవులు ఇతర రాజుల వద్దకు దూతలను పంపారు గాని, కృష్ణుడి వద్దకు అర్జునుడు స్వయంగా బయలు దేరాడు. వేగులవాళ్ళ ద్వారా పాండవుల చర్యలన్నీ తెలుసుకుంటున్న దుర్యోధనుడు కొద్దిపాటి పరివారాన్ని వెంటబెట్టకుని, తాను కూడా స్వయంగానే ద్వారకకు వెళ్ళాడు. అర్జునుడూ, దుర్యోధనుడూ ఒకే రోజు ద్వారకలో అడుగుపెట్టారు.

ఇద్దరూ కృష్ణుడి ఇల్లు చేరేసరికి కృష్ణుడు నిద్రపోతున్నాడు. కృష్ణుడి తలదిక్కుగాఒక ఉత్తమాసనంఉన్నది.దుర్యోధనుడుతిన్నగా వెళ్ళి అందులో కూర్చున్నాడు.దుర్యోధనుడి వెనకనే అక్కడికి ప్రవేశించిన అర్జునుడు చేతులు కట్టుకుని, కృష్ణుడి కాళ్ళ వద్ద నిలబడ్డాడు.

మరికొంత సేపటికి కృష్ణుడు నిద్రలేస్తూ, తన కాళ్ళ వద్ద నిలబడి ఉన్న అర్జునుణ్ణి చూసి, తరవాత తన తల వైపున కూర్చుని ఉన్న దుర్యోధనుణ్ణి చూశాడు. అతను ఇద్దరితోనూ కుశలప్రశ్నలు చేసి, అతిథి సత్కారాలు పూర్తి చేసిన మీదట వారు వచ్చిన పని అడిగాడు.

దుర్యోధనుడు చిరునవ్వు నవ్వుతూ, "కృష్ణా, మాకు జరగబోయే యుద్ధంలో నువ్వు నాపక్షానఉండి సహాయంచెయ్యాలి. నీకు నేనొకటి, అర్జునుడు ఒకటీ కాదు గద! ఇద్దరమూ నీకు ఒకేరకం బంధువులం. అయినా, ముందుగా నేను నీవద్దకు వచ్చాను. అందుచేత నువ్వు నాకేసహాయం చెయ్యటం ధర్మం," అన్నాడు.

దానికి కృష్ణుడు, "నువ్వు ముందే వచ్చావు గాని, నేను ముందు అర్జునుణ్ణి చూశాను. అందుచేత, నేను మీ ఇద్దరికీ సహాయంచేస్తాను. చిన్నవాడు గనక అర్జునుడు ముందు కోరుకుంటాడు. నావంటి వారు యోధులు పదిలక్షలమంది ఉన్నారు. వారు ఒకపక్షం. నేను మరొకపక్షం. నేను మాత్రం యుద్ధంచెయ్యను, సలహాఇస్తాను. అర్జునా, ఇందులో నువ్వు ఏ పక్షం కోరుకుంటావు?" అని అడిగాడు.

అర్జునుడు కృష్ణుణ్ణి ఎంచుకున్నాడు. పది లక్షలమంది గోపాలయోధులను తీసుకోవటానికి దుర్యోధనుడు సంతోషంగా ఒప్పుకున్నాడు. తరవాత అతను బలరాముడి వద్దకువెళ్ళి, యుద్ధంలో సహాయం చెయ్యమని కోరాడు.

బలరాముడుదుర్యోధనుడితో, "నాయనా, విరాటనగరంలో పెళ్ళికి వెళ్ళినప్పుడునేను మీ రెండు పక్షాలను సమానంగా చేసి మాట్లాడాను. కాని కృష్ణుడు నాతో ఏకీభవించలేదు. ఏ పక్షానికీ సహాయం చెయ్యరాదని నేను అప్పుడే నిశ్చయించుకున్నాను. కాకపోయినా, నీకు ఒకరి సహాయంతో ఏం పని? వెళ్ళి క్షాత్రధర్మంతో యుద్ధం చెయ్యి!" అన్నాడు.



దుర్యోధనుడు పరమానంద భరితుడై, బలరాముణ్ణి గట్టిగా కౌగలించుకుని, తనకు విజయం కలిగినట్టే భావించుకుని, కృతవర్మ వద్దకు వెళ్ళి, ఆయనను సహాయం అడిగాడు. కృతవర్మ దుర్యోధనుడికి ఒక అక్షౌహిణీ సేన ఇచ్చాడు. దుర్యోధనుడు ఈవిధంగా తాను వచ్చిన పనిపూర్తి చేసుకుని హస్తినాపురానికి తిరిగివెళ్ళాడు.

దుర్యోధనుడు వెళ్ళిపోగానే కృష్ణుడు అర్జునుడితో, "నేను యుద్ధం చెయ్యనని చెప్పాను గదా, నన్నే కోరుకుని పెద్దసేనను ఎందుకుపోగొట్టుకున్నావు?" అనిఅడిగాడు.

దానికి అర్జునుడు, "ఆ సేనను నువ్వు ఒక్కడివే జయించగలవు. శత్రువులనందరినీ నేనొక్కణ్ణే జయించగలను. నువ్వు యుద్ధంచేస్తే ఆ కీర్తి అంతా నీకే దక్కుతుందిగాని నాకేం మిగులుతుంది? నాకు కాస్త కీర్తికాంక్ష ఉండటం చేత, యుద్ధం చెయ్యని నిన్నే కోరుకున్నాను. నువ్వు నాకు ఒక్క సహాయం చెయ్యాలి. నువ్వు నాకు రధసారధిగా ఉండాలి. ఈ కోరిక నాకు చాలా కాలంగా ఉన్నది. నువ్వు సారథిగా ఉంటే, ఈకౌరవ సైన్యాన్నేమిటి, సురాసురులు ఏకమై వచ్చినా జయించగలను. అందుచేత నా ఈ కోరిక కాదనకుండా తీర్చు." అన్నాడు.

"నీ కోరిక తప్పకుండా తీర్చుతాను," అని కృష్ణుడు మాట ఇచ్చి, అర్జునుణ్ణి పంపేశాడు.

మద్రదేశపు రాజూ, నకులసహదేవుల మేనమామా అయిన శల్యుడికి పాండవులు పంపిన దూత ద్వారా పిలుపు అందింది. ఆయన పాండవులకు సహాయం చెయ్య



టానికి ఒక అక్షౌహిణి సేననూ, మహారథు లైన తన కొడుకులనూ వెంటబెట్టుకుని బయలుదేరాడు. మద్రదేశపు దుస్తులూ, అలంకారాలూ, వాహనాలూ, రథాలూ విచిత్రంగా ఉండేవి. మహా పరాక్రమ వంతుడయిన శల్యుడు ఆ వింత సేనతో మజిలీలు చేసుకుంటూ పాండవులున్న చోటికి రాసాగాడు.

శల్యుడు పాండవులకు సహాయం వెళుతున్న సంగతి చారుల వల్ల తెలుసు కుని దుర్యోధనుడు, తన మనుషులద్వారా శల్యుడు మజిలీ చేసినప్పుడల్లా సకల సదుపాయాలూ చేయించాడు. గుడారాలు వేయించి, వాటిని అలంకరింప జేశాడు; అద్భుతమైన వంట ఏర్పాట్లూ, వినోదాలూ అమర్చాడు. శల్యుడికి ప్రయాణం అమిత సుఖంగా జరిగింది. ఇదంతా తనకోసం ధర్మరాజు చేయిస్తున్న ఏర్పాట్లేనని శల్యుడు అనుకుని ఒకసారి, "నాకీ సదుపాయాలు చేయిస్తున్న వాళ్ళను తీసుకురండి. వారు కోరిన వరాలిస్తాను," అన్నాడు.

రహస్యంగా శల్యుడి వెంటనే ఉంటున్న దుర్యోధనుడు ముందుకు వచ్చాడు. శల్యుడు అతన్ని తగిన విధంగా సత్కరించి, "నాయనా, నీకేమి కావాలో చెప్పు, తప్పక ఇస్తాను," అన్నాడు.

వెంటనే దుర్యోధనుడు, "రాజా, నాసైన్యా నికి నాయకుడివిగా ఉండు," అన్నాడు.

శల్యుడు అందుకు సమ్మతించి, "దుర్యో ధనా, ఇప్పుడు నువ్వు మీ నగరానికి తిరిగి వెళ్ళు. నేను ధర్మరాజును చూడ వలసిన పని ఉన్నది. అతనితో మాట్లాడి నీ దగ్గరికి వస్తాను," అన్నాడు.

"ధర్మరాజును చూసి త్వరగా వచ్చెయ్యి. మా విజయం నీపైనే ఆధారపడి ఉన్నది," అని దుర్యోధనుడు శల్యుణ్ణి కౌగలించు కుని, హస్తినాపురానికి వెళ్ళిపోయాడు.

తరవాత శల్యుడు ఉపప్లావ్యంలోని పాండవ సైనికశిబిరాన్ని చేరుకుని, ధర్మ రాజు నుంచి అతిథి సత్కారాలు పొంది, నకుల సహదేవులను కౌగలించుకుని, వారిని తన చెంత కూర్చోబెట్టుకుని, ధర్మరాజుతో, "రాజా, క్షేమంగా వున్నావా? దైవానుగ్రహంవల్ల అరణ్యవాసం నుంచి బయటపడ్డావు. అంతకన్న దారుణమైన అజ్ఞాతవాసం కూడా చేశావు. రాజ్యభ్రష్టుడికి కష్టాలు గాక సుఖాలు కలుగుతాయా? కౌరవులను యుద్ధంలో గెలిచి సుఖపడ

తావులే. ఇంత జరిగాక నిన్నూ, నీతమ్ము లనూ సుఖంగా ఉండగా చూశాను. అంతేచాలు," అన్నాడు.

ఆయన ధర్మరాజుతో, తాను, వచ్చే దారిలో దుర్యోధనుడు చేసిన అతిథి మర్యాదలూ, అతడికి సహాయపడతానని ఎలా మాట ఇచ్చినదీ చెప్పాడు.

అంతా విని ధర్మరాజు, "మహారాజా, నువ్వు చేసిన పని మంచిదే. సంతోష పెట్టిన వాడి కోరిక తీర్చటం పెద్దవాళ్ళు చెయ్యదగినదే కదా! కాని నాకు కూడా ఒక గొప్ప ఉపకారం చెయ్యాలి. నువ్వు యుద్ధరంగంలో కృష్ణుడితో సమానుడివి. కర్ణార్జునులకు యుద్ధం జరిగినప్పుడు నువ్వు కర్ణుడికి సారథ్యం చెయ్యవలసిన అవసరం కలుగుతుంది. అందుకు సందేహంలేదు. ఎందుకంటే అర్జునుడి సారథి అయిన కృష్ణుడితో సమానుడు కౌరవ సేనలో మరొకడు ఉండడు. కర్ణుడికి సారథ్యం చేసేటప్పుడు అర్జునుణ్ణి రక్షించు, కర్ణుడికి ఉత్సాహ భంగం చెయ్యి. ఇదేనా ప్రార్థన," అన్నాడు.

దానికి శల్యుడు, "నీకేమీ విచారంవద్దు. అవకాశం వచ్చినప్పుడు దుర్మార్గుడైన కర్ణుడిసంగతి నేను చూస్తాను, అర్జునుడికి విజయం కలిగేటట్టు చేస్తాను," అన్నాడు.

ధర్మరాజు అనుభవించిన కష్టాలను గురించి ప్రస్తావించుతూ, దేవేంద్రుడంతటి వాడు అనుభవించిన కష్టాలను గురించి శల్యుడు ఈ విధంగా చెప్పాడు:

త్వష్ట ప్రజాపతి ఇంద్రుడికి ద్రోహం తలపెట్టి, ఇంద్రుణ్ణి జయించగల విశ్వరూపుడనే వాణ్ణి సృష్టించాడు. విశ్వరూపుడికి మూడు తలలు. ఈ మూడు తలల వాడు ఇంద్రపదవి కోసం తపస్సు ప్రారంభించాడు. వాడి తపస్సు ఫలిస్తుందని



ఇంద్రుడు భయపడి, ఆ విశ్వరూపుడి తపస్సుకు భంగం కలిగించమని అప్సరసలను పంపాడు. కాని వాళ్ళు విశ్వరూపుడి బుద్ధిని చలింపజేయలేకపోయారు.

అప్పుడు ఇంద్రుడు తానే వెళ్ళి విశ్వరూపుణ్ణి వజ్రాయుధంతో కొట్టి చంపాడు. అందువల్ల ఇంద్రుడికి భయం తీరిపోయింది గాని, త్వరలోనే అంతకన్న పెద్ద ప్రమాదం అతనికి దాపరించింది.

తన కొడుకును ఇంద్రుడు చంపాడని తెలిసి త్వష్ట మండిపడి, ఇంద్రుణ్ణి చంపగల వాణ్ణి, వృత్రుడు అనేవాణ్ణి సృష్టించాడు. ప్రళయకాల సూర్యుడిలాటి వృత్రుడు తండ్రి ఆజ్ఞమీద స్వర్గానికివెళ్ళి, ఇంద్రుణ్ణి యుద్ధానికి పిలిచాడు. ఆయుధాలు లేని వృత్రుడు ఇంద్రుడి అస్త్రాలను లక్ష్యపెట్టక, అతన్ని పట్టుకుని మింగేశాడు. కాని వృత్రుడికి ఆవలింత వచ్చేసరికి ఇంద్రుడు తిరిగి బయటపడి, వృత్రుడితో యుద్ధం మాని పారిపోయాడు.

తరవాత ఇంద్రుడు దేవతలను వెంటబెట్టుకుని విష్ణువు వద్దకు వెళ్ళి, తనకు దాపురించిన కష్టాలు తెలిపి, వృత్తుణ్ణి చంపే ఉపాయం చెప్పమని వేడుకున్నాడు. "వృత్రుడు ఇప్పుడు చావడు. వాడితో ముందు సఖ్యం చేసుకో," అని విష్ణువు ఇంద్రుడికి సలహా ఇచ్చాడు. అప్పుడు మహర్షులు వెళ్ళి, వృత్రుడితో, "నువ్వు ఇంద్రుణ్ణి జయించలేవు. ఇంద్రుడు నిన్ను జయించలేడు. మీరిద్దరూ సంధి చేసుకుని సౌఖ్యంగా ఉండండి," అని చెప్పారు.

వృత్రుడు వారి మాట విని ఇంద్రుడితో సంధిచేసుకుని, ఇంద్రుడంటే చాలాప్రేమతోనూ, గౌరవంతోనూ ఉంటూ వచ్చాడు. కాని ఇంద్రుడు సమయంకోసం కాచుకుని ఉండి, ఒకసాయంకాలం వృత్రుడు ఒంటరిగా సముద్రతీరాన విహరిస్తున్న సమయంలో, తన వజ్రాయుధంతో చంపేశాడు.

విశ్వరూపుణ్ణి చంపినపాపమూ, వృత్రుణ్ణి చంపిన పాపమూచుట్టుకుని ఇంద్రుడు మతిచెడి, ఎవరికీ కనపడకుండా తిరగసాగాడు. ఇంద్రుడిలా అయిపోగానే ఇంద్రపదవికి మరొకరిని చూడవలసి వచ్చింది. మహర్షులు నహుషుడి వద్దకు వెళ్ళి, ఆయనను ఇంద్రపదవి గ్రహించమనీ, మూడులోకాలూ ఏలమనీ వేడుకున్నారు.



# చందమామ కబుర్లు

## చాలా పొడవైన ఆటవస్తువు

పిల్లల ఆటవస్తువులు అనగానే మనకు టాయ్‌గన్స్, రిమోట్‌కంట్రోల్‌తో నడిచే మోటారు కార్లు, రైళ్ళు గుర్తుకు వస్తాయి. ఏనుగు, ఎలుగుబంటి, పిల్లి, కుందేలు బొమ్మలు కూడా పిల్లల్ని బాగా ఆకర్షిస్తాయి. పిల్లల ఆటవస్తువులలో చాలా పొడవైనది ఏదో తెలుసా? 1994వ సం॥లో 419మీ॥ పొడవైన పాముబొమ్మను నార్వే విద్యార్థులు రూపొందించారు. మరి ఇప్పుడు సింగపూర్‌లో దానికన్నా పొడవాటి చైనీస్ డ్రాగన్‌ను తయారు చేశారు. వికలాంగుల సంక్షేమ నిధి సేకరణ కోసం, సింగపూర్ ఎయిర్ లైన్స్ కోరికమేరకు, దీనిని తయారుచేశారు. 'జమ్‌క్లిప్స్'తో తయారైన అతిపొడవైన చెయిన్ కూడా సింగపూర్‌లోనే వుంది.

## పాత రైలుఇంజను

95 సంవత్సరాలకు పూర్వం ఇండియాలో దానిని ప్రవేశపెట్టినప్పుడు 'ఫెయిరీక్వీన్' అని పిలిచారు. రైలు పట్టాలపై నుంచి తొలగించాక దానిని ఢిల్లీ నేషనల్ రైల్వే మ్యూజియంలో వుంచారు. ఇప్పుడు దానిద్వారా విదేశమారకద్రవ్యాన్ని సంపాదించవచ్చా, అని మన రైల్వే మంత్రిత్వశాఖ ఆలోచించింది. ఇంజన్ను బాగుచేయించి మెరుగులు దిద్దింది. పట్టాలపైకి తెచ్చి దానికి రెండు పెట్టెలు తగిలించింది. ఒకపెట్టెలో 60 మంది ప్రయాణం చేయవచ్చు. రెండవ పెట్టెలో సరుకులు, సరంజామాలు పెట్టుకోవచ్చు. అక్టోబర్ నెల మొదలు ఢిల్లీ నుంచి రాజస్థాన్‌లోని అల్వార్ వరకు రైలు రాకపోకలు ఆరంభమయ్యాయి. వారానికి ఒకసారి ప్రకారం 5నెలలు సాగుతుంది. దీనిలో ప్రయాణం చేయడానికి 400 అమెరికన్ డాలర్లు (సుమారు 15,000 రూ॥) చెల్లించాలి. అల్వార్ చేరడానికి పట్టే ప్రయాణకాలం 6 గంటలు. పర్యాటకులను అక్కణ్ణించి 'సరీస్కా వైల్డ్‌లైఫ్ శాంక్చువరీకి' తీసుకువెళ్ళి, మర్నాడు తిరుగు ప్రయాణానికి రైలు దగ్గర దింపుతారు. ఈ పాతరైలుఇంజన్నుతయారుచేసిన బ్రిటిష్ కంపెనీ ఇప్పుడు లేదు. కాని ఇది ఇంకా కొంతకాలం పని చేయగలదని భావిస్తున్నారు.




## క్రీ.పూ. 4వ శతాబ్దానికి చెందిన ప్రపంచపటం

ముప్ఫైయేళ్ళ క్రితం రాగిరేకు మీద చెక్కబడిన ప్రపంచ పటం ఒకటి చైనాలో బయటపడింది. ఇది క్రీ.పూ. 340 సం॥ నాటిదని ఇటీవల పురాతత్వ శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. హెబీ పరగణా, పింగ్‌షాన్ ప్రాంతానికి చెందిన 2,300 సం॥లకు పూర్వం నాటిదైన ఈ ప్రపంచ పటమే చాలా ప్రాచీనమైనదని భావిస్తున్నారు. ఇందులోని కొలతలు నిర్దుష్టంగా ఉన్నాయి. అక్షాంశ, రేఖాంశ రేఖలు మాత్రం కనిపించడంలేదు.

## రికార్డు తేయాకు ధర!

నీరసంగా ఉన్నప్పుడు వేడిగా కప్పు టీ తీసుకుంటే హుషారు పుట్టుకొస్తుంది. మామూలుగా ఇవాళ 1కిలో తేయాకు ధర 100 నుంచి 150 రూ॥ వరకు ఉంది. డార్జిలింగ్‌లో పండిన ప్రత్యేక తేయాకును ఇటీవల కలకత్తాలో వేలంపాటకు పెట్టారు. అది 1కిలో 2,700 రూపాయల వరకు పలికింది!

చందమామ
అనుబంధం
111



మనదేశపు
అందచందాలు

# పుష్కర్ మేళా



పుష్కర్ రాజస్థాన్ లోని చిన్న పట్టణం. దేవాలయాలకు అది ప్రసిద్ధి గాంచింది. ప్రపంచంలో అతి పెద్ద ఒంటెల సంత యేటా అక్కడ జరుగుతుంది. కార్తీక పూర్ణిమకు పదిరోజులముందు, ఒంటెలు బారులు బారులుగా అక్కడికి చేరుకుంటాయి. ఒంటెలను అలంకరించి ప్రదర్శనకు ఉంచుతారు. భారీ ఎత్తున ఒంటెల క్రయవిక్రయాలు జరుగుతాయి. ఒంటెల పరుగుపందాలు కూడా జరుపుతారు.

అల్లికలు గల స్లిప్పర్లు, వాల్ హేంగింగ్స్, చిత్రాలు, రకరకాల ఆభరణాలు పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తాయి. సూక్ష్మమైన పనితనంతో నిండిన కొయ్య శిల్పాలకూ, తివాసీలకూ, మట్టిపాత్రలకూ, పూసలకూ కూడా ఈ సంత పేరుగాంచింది. ఒంటెల చర్మంతో తయారుచేసి ఎరుపు, బంగారం, పచ్చరంగులలో పెయింట్ చేయబడిన సీసాలు, ల్యాంప్‌షేడ్స్ చాలా ఆకర్షణీయంగా వుంటాయి. యంత్రాల సాయం లేకుండా చేత్తో తయారుచేసే అందమైన వస్తువులు ఇవి. మన కళాకారుల అద్భుతమైన పనితనానికి ఇవి సాక్ష్యాలు. కళావినోదాలపట్ల ఆసక్తిగలవారికోసం - బొమ్మలాటలు, నాటకాలు, పాటలు, నాట్యాల ప్రదర్శనలు ఏర్పాటు చేస్తారు.

## మీకు తెలుసా?

### వార్తాపత్రికలు...



క్రీ.పూ. 5వ శతాబ్దంలో రాజధాని రోము నగరానికి దూరంగా వున్న ప్రజలకు రాజధాని సమాచారాలను తెలియజేస్తూ సమాచార లేఖలు పంపేవారు. క్రీ.పూ. 60వ సం॥లో జూలియస్ సీజర్ దీనిని క్రమబద్ధం చేశాడు. ఆయన ప్రభుత్వం కింది 'ఫోరమ్' దీనిని రోజూ ప్రచురించేది. దీనిని 'ఆక్టాడ యర్నా' (నిత్యసంఘటనలు) అనేవారు. ప్రస్తుతం మన వార్తాపత్రికలను పోలిన పత్రిక మొట్టమొదట లండన్‌లో 1663వ సం॥లో 'ఇంటెలిజెన్స్' పేరుతో వెలువడింది. అమెరికాలోని బోస్టన్ నగరంలో 'పబ్లిక్ అక్కరెన్‌సెస్' 1690లో ప్రారంభించబడింది. అమెరికన్ సివిల్‌వార్ జరిగినప్పుడు ప్రజలలో వార్తాపత్రికల పట్ల ఆసక్తి పెరిగింది. అప్పటికే అమెరికా నుంచి దాదాపు 37 పత్రికలు వెలువడుతూ ఉండేవి.

### ఇంద్రధనుస్సు

### కదిలే పువ్వులు



సముద్ర తీరాలలోని లోతులేని జలాశయాల లోనూ, అక్కడి బండలనానుకునీ 'ఆనిమోన్స్' కనిపిస్తాయి. ఇవి అలలు లేనప్పుడు జిగట రంగు ముద్దల్లా కనిపిస్తాయి. మునిగి వున్నప్పుడు కదిలే పువ్వుల్లాగా కనిపిస్తాయి. వీటిని 'సీఆనిమోన్స్' అంటే 'గాలిపువ్వులు' అని అన్నప్పటికీ ఇవి పువ్వులుగాని, మొక్కలు గాని కావు; జంతువులు. చిన్న చిన్న పురుగులను, పట్టి తినే మాంసాహార జంతువులు ఇవి. వెన్నెముక ఆధారంలేని కూజా వంటి శరీరం పైన గుండ్రంగా పూరేకులవంటి మీసాలు ఉండడమే ఇవి పువ్వుల్లా కనిపించడానికి కారణం. సీఆనిమోన్స్‌జాతికిత చెందిన 'కోరల్స్' అనే జంతువులు కాల్షియం వంటి ఖనిజ పదార్థాలతో అస్థిపంజరాలను నిర్మిస్తాయి. వీటినే పగడాలు అని అంటారు.

స్వాతంత్ర్య స్వర్ణోత్సవ సంవత్సర చందమామ కానుక!

# ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం



[భారతదేశం పలు ప్రాంతాలలో క్రమంగా పరాయి పాలకులపట్ల వ్యతిరేకత ప్రబలసాగింది. కాన్పూరు తిరుగుబాటు తరవాత నానాసాహెబ్ మరాఠా రాజుగా అభిషిక్తుడయ్యాడు. ఆ సంఘటన ప్రేరణతో ఝాన్సీరాణి లక్ష్మీబాయి, ఈస్ట్ ఇండియా కంపెనీ ఆక్రమించుకున్న తన ప్రాంతానికి స్వతంత్రం ప్రకటించుకుని, వెంటనే ఝాన్సీ కోటనుంచి బ్రిటిష్ సైనికులను వెళ్ళిపొమ్మని హెచ్చరించింది. కాని వాళ్ళా హెచ్చరికను లెక్కచేయలేదు. ఝాన్సీ ప్రజలు కోటపై ముట్టడి జరిపి సైనికులను హతమార్చారు. — తరవాత]

అది ఒక సాయంకాల సమయం. ముస్లిం మతానికి చెందిన ఒక ఫకీరు, ఆరుగురు అనుయాయులతో తూర్పు దిశగా నడుస్తున్నాడు. హిందూమతానికి చెందిన మరొక సాధువు శిష్యగణం వెంటరాగా ఏనుగు అంబారీ మీద ఆసీనుడై అతనికి ఎదురయ్యాడు. ఆయన్ను చూడగానే ఫకీరు చేయెత్తి, "దీన్! దీన్!" అన్నాడు. సాధువు కూడా అదేవిధంగా చేయిపైకెత్తి, "భూమ్! భూమ్!" అన్నాడు. ఫకీరు మందహాసంచేయగానే, సాధువు ఏనుగుపై నుంచి దిగి ఆయన్ను ఆనందంగా కౌగిలించుకున్నాడు. ఇరువురూ తమ అనుచరులను అక్కడే వదిలి, దాపులనున్న చిన్న కొండమీదికివెళ్ళి తీవ్రమైన చర్చలలో నిమగ్నులయ్యారు.

వారిరువురూ తమ మత సిద్ధాంతాలను గురించి చర్చించుకున్నారా, అంటే

అదేంకాదు. పరాయి పాలకుల్కు వ్యతి రేకంగా సాధారణ ప్రజలను తట్టి లేప డంలో తమకు ఎదురైన అనుభవాలనూ, జయాపజయాలనూ పరస్పరం తెలియ జేసుకున్నారు. తాము ఏఏ రాజులను కలుసుకున్నదీ; ఏఏ సంస్థానాధీశులతో చర్చలు జరిపినదీ, పలుకుబడిగల ఏఏ ప్రముఖులకు సందేశాలు అందించినదీ; ఎవరెవరు ఎలాంటి సహాయసహకారాలు అందజేసినదీ, ఎటువంటి వాగ్దానాలుచేసి నదీ ఒకరికొకరు తెలియజేసుకున్నారు.

బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా సాగు తూన్న పోరాటంలో హిందువులూ, ముస్లింలూ తమ మధ్య భేదాలు మరిచి ఐకమత్యం కనబరిచారు. వేషభాషలూ, పేర్లూ వేరైనప్పటికీ ఉభయులూ భరత మాత బిడ్డలమన్న భావం వాళ్ళల్లో బాగా వేళ్ళూనింది. వాళ్ళకునాయకత్వం వహిం చిన నానాసాహెబ్, అజిముల్లాఖాన్ ఇరు వురూ కూడా-హిందువులూ, ముస్లింలూ అన్నదమ్ముల్లా ఐకమత్యంతో పోరాడి దేశానికి విముక్తి కలిగించాలని తమ అనుచరులను ఉద్బోధించారు.

స్ఫురద్రూపి అయిన అజిముల్లాఖాన్ రాజనీతిజ్ఞుడుగా పేరుగాంచాడు. ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలు ఆయనకు బాగాతెలుసు. నానాసాహెబ్ ప్రతినిధిగా ఇంగ్లాండు వెళ్ళి, ఈస్టిఇండియా కంపెనీ నేతలకు ఇక్కడి పరిస్థితులనూ, భారతీయ ప్రజల సంప్ర దాయాలనూ తన శక్త్యానుసారం వివరిం చాడు. కాని తానువెళ్ళిన కార్యంలో కృత కృత్యుడు కాలేకపోయాడు. కంపెనీ ఒడి గట్టిన దురన్యాయాలనుంచి బయటపడా లంటే, కంపెనీని భారత భూమినుంచి వెడలగొట్టడం ఒక్కటే మార్గం అన్న దృఢ నిశ్చయానికి వచ్చాడు.





మాతృభూమిని చేరుకున్నాక అక్కడక్కడ రహస్యంగా విప్లవసంఘాలు ఏర్పరచడంలోనూ, వివిధ నాయకులకు సందేశాలతో దూతలను పంపడంలోనూ నానాసాహెబ్‌తో కలిసి చురుకుగా పాల్గొన్నాడు.

కాన్పూరు విముక్తి, నానాసాహెబ్ పట్టాభిషేకం, బ్రిటిష్ కంపెనీ ప్రతిష్ఠను దారుణంగా దెబ్బతీశాయి. నానాసాహెబ్‌ను ఎలాగైనా పడగొట్టాలన్న కృతనిశ్చయంతో, బ్రిటిష్ ప్రభుత్వం, హేవ్‌లాక్ అనే జనరల్‌ను సేనానాయకుడిగా పంపింది. కాన్పూరు సమీపంలోని నదీతీరంలో జరిగిన బ్రిటిష్ వాళ్ళ ఊచకోచ గురించిన వార్త హేవ్‌లాక్‌కు అందింది. కాన్పూరు ప్రజలపై పగసాధించి తీరాలన్న ఏకైక లక్ష్యంతో, వెయ్యిమంది బ్రిటిష్ సైనికులనూ, వందలాది భారతీయ సిపాయిలనూ వెంటబెట్టుకుని కాన్పూరు మీదికి దాడి వెడలాడు. మార్గ మధ్యంలోనే అతడి పైశాచిక కృత్యాలు ఆరంభమయ్యాయి. గ్రామాలను దోచుకుని తగలబెట్టడమే కాదు; ఎదురుపడ్డ ప్రతి భారతీయుణ్ణీ హతమార్చసాగాడు.

ఫతేఘడ్ పట్టణాన్ని సమీపించగానే, మొదట ఆ పట్టణంలోకి జొరబడి కావలసిన వాటిని కొల్లగొట్టమని తన సైనికులను ఆజ్ఞాపించాడు. ఆతరవాత అక్కడి ప్రజలను బలవంతంగా ఇళ్ళల్లోకి నెట్టి, తాళంపెట్టి, ఇళ్ళకు నిప్పంటించాడు!

హేవ్‌లాక్ సైనికులు కాన్పూరు కేసి వస్తూన్న సంగతీ, వాళ్ళు మార్గమధ్యంలో చేస్తూన్న దారుణ కృత్యాల గురించీ నానాసాహెబ్‌కు తెలిసింది. నానాసాహెబ్ వెంటనే కాన్పూరు వదిలివెళ్ళి, ఆ తరవాత తగిన అవకాశం చూసుకుని బ్రిటిష్ వాళ్ళపై దాడిజరపాలని కొందరు శ్రేయోభిలాషులు ఆయనకు సలహా ఇచ్చారు. కాని శత్రువులను ముఖాముఖిగా ఎదుర్కోవడానికే నానాసాహెబ్ నిర్ణయించాడు. "ఒకవేళ మనకు ఓటమి సంభవించిందే అనుకుందాం. ఆలోగా మనం కొంతమంది శత్రుసైనికులను హతమార్చవచ్చు. అదీ మనకు ఉపయోగకరమే!" అన్నాడు.

అంతలో హేవ్‌లాక్ సైన్యం కాన్పూరును సమీపించింది. నానాసాహెబ్ సైనికులు నగరం నుంచి మైదానంలోకి వచ్చారు. నానాసాహెబ్ స్వయంగా సైన్యా

నికి నాయకత్వం వహించాడు. అయితే, నానాసాహెబ్ సేనలు సమీపించగానే, హేవ్‌లాక్ సైన్యం, వెనకడుగువేసి సరి కొత్త వ్యూహాన్ని చేపట్టింది. నానా సాహెబ్ సైనికులు ఎదురెదురుగా పోరాడడానికి సిద్ధపడి ముందుకు వచ్చారు. కాని బ్రిటిష్ సైనికులు అక్కడి నుంచి వెను దిరిగి, రెండుగా చీలి, నగరాన్ని కుడివైపు నుంచీ, ఎడమవైపు నుంచీ ఒక్కసారిగా ముట్టడించారు. నానాసాహెబ్ ఈ హఠాత్ పరిణామాన్ని ఊహించలేకపోయాడు. గందరగోళానికి లోనైన తన సైనికులను సమీకరించుకుంటూ,అచంచల ధైర్యంతో నానాసాహెబ్ మళ్ళీ యుద్ధం సాగించాడు. కాని సుశిక్షుతులైన బ్రిటిష్ సైనికులు, వాళ్ళ దగ్గరున్న శ్రేష్ఠమైన మందుగుండు సామగ్రి కారణంగా వాళ్ళ ధాటికి నానా సాహెబ్ సేనలు తట్టుకోలేకపోయాయి. బ్రిటిష్‌సైనికులు వాళ్ళను నుగ్గు చేశారు!

తుపాకీ ప్రేలుళ్ళ ధ్వనులూ, సైనికుల అరుపులూ, ఏడుపులూ, రోదనలూ సాగు తున్నప్పుడే నలుదిశలనూ చీకటి అలు ముకోసాగింది. నానాసాహెబ్‌ను వెదికి పట్టుకోమని హేవ్‌లాక్ తన మనుషులను ఆజ్ఞాపించాడు. శవాల మధ్య, క్షతగాత్రుల మధ్య వెతికారు. కనిపించలేదు. ఇళ్ళల్లో గాలించారు. కాని ప్రయోజనం లేకపో యింది. నానాసాహెబ్ కొందరు అనుచ రులతో తప్పించుకున్నాడనీ; వెళుతూ వెళుతూ బంగారాన్నీ, ధనాన్నీ చేజిక్కిం చుకుని మరీ వెళ్ళాడనీ హేవ్‌లాక్‌కు తెలియవచ్చింది.



హేవ్‌లాక్ ఆశాభంగానికి గురయ్యాడు. ఆగ్రహంతో దారుణమైన ప్రతీకార చర్యకుపూనుకున్నాడు. వందలాది బ్రాహ్మ ణులను బంధించాడు. వారిలో పలువురు పండితులు, గురువులు, పూజారులు, ప్రముఖులు ఉన్నారు. పెడరెక్కలు విరిచి కట్టి వాళ్ళను బలవంతంగా నిర్మానుష్యం గావున్న కంపెనీ కోటలోకి లాక్కుపో యారు. ఆ కోట ప్రాంగణంలో నేలమీద ఎండిన నెత్తుటిమరకలు కనిపించాయి. అది బ్రిటిష్‌వాళ్ళ రక్తం. ఆ రక్తాన్ని నేలపై పడుకుని నాలుకలతో శుభ్రం చేయాలని బందీలను కిందపడదోసి వేధించారు. వాళ్ళలా చేయకతప్ప లేదు! ఆవిధంగా అవమానించిన తరవాత వాళ్ళను వదిలి పెట్టకుండాఅందరినీచంపించాడు.

వీలర్ మరణానికి ప్రతీకారంగా జనరల్ హేవ్‌లాక్ అమాయక ప్రజలను దారుణంగా హింసించాడు. స్థానికులను గుంపులు గుంపులుగా ఉరితీయించాడు. అయినప్పటికీ, మరణ సమయంలో సైతం కొందరు విప్లవవీరులు చూపిన ధైర్యం అసమానమైనది. తమ సిద్ధాంతాల పట్ల, మాతృదేశంపట్ల వారికున్న భక్తి శ్రద్ధలకు, అంచంచలమైన పట్టుదలకు అది అద్భుత తార్కాణం!

నానాసాహెబ్ ప్రభుత్వంలో న్యాయమూర్తి పదవిని నిర్వహించిన ఒక పెద్ద మనిషిని బంధించి మరణదండన విధించారు. ఆ మరణదండన తనకు గాక, మరెవరికో విధించినంత తేలికగా దానిని ఆ న్యాయమూర్తి తీసుకున్నాడు. మరణదండన విధించినతరవాత అతడు, వెను దిరిగి దృఢంగా అడుగులు వేసుకుంటూ ఎంతో గుండెనిబ్బరంతో నడిచాడు. తన అంతిమ యాత్రకు సిద్ధంచేస్తూన్న వారిని ఏమాత్రం భయాందోళనలు లేకుండా నిర్విచారంగా చూస్తూ నిలబడ్డాడు. అతన్ని చూస్తూంటే సమాధి స్థితికి చేరుకునే యోగిలాగాకనిపించాడు. తన విశ్వాసం కోసం పొందుతూన్న మరణం - పాషండులసాంగత్యంనుంచివిముక్తి కలిగించి స్వర్గసుఖాలను అందించే ఒక మార్పు లాగా ఆయనకు అనిపించింది!

కాన్పూరును మళ్ళీ పట్టుకోవడంతో కంపెనీ శిబిరాలలో ఆనందం తాండవించింది. కాని అంతలోనేఅవాంతరాలు ముంచుకొస్తున్నాయన్న వార్తలు కూడా వారికి అందాయి. ఢిల్లీనగరం ఉద్రిక్తతకు లోనయింది. లక్నోనగరంలో అలజడులు బయలుదేరాయి. బీహార్‌లో అక్కడక్కడ తిరుగుబాట్లు చెలరేగాయి.

భారతదేశంలోనూ, ఇంగ్లాండులోనూ ఆంగ్లేయులకు, "కంపెనీ ప్రభుత్వంఇంకా ఎన్నాళ్ళు కొనసాగగలదు?" అన్న అనుమానం కలిగింది. వాళ్ళ అనుమానానికి ఆధారం లేకపోలేదు. పరాయిపాలనను తొలగించాలన్నప్రయత్నంలో, భారతదేశపు రాజులు ఐకమత్యంతో మసలుకుని వున్నట్టయితే సిపాయిల తిరుగుబాటే భారతస్వాతంత్ర్యాన్ని సాధించి ఉండేది! అయినా అలా జరగలేదు -(ఇంకావుంది)





# పరువు తీసిన పాయసం

ఒక గ్రామంలో చలమయ్య అనే పెద్ద కామందు ఉండేవాడు. అతనికి స్వార్జితం, పిత్రార్జితం బోలెడు ఉండేది. కాని అతను పరమలోభి. అయితే ఈ సంగతి ఊరి వారికి తెలియదు. అతను చాలా గొప్ప వాడనీ, తన పంక్తిని ఎవరన్నా లేనిదే భోజనం చెయ్యడనీ అంతాచెప్పుకునేవారు.

ఎందుచేతనంటే, ప్రతిరోజూ మధ్యాన్నం వేళ తాను భోజనం చెయ్యబోయే ముందు, చలమయ్య వీధి వాకిట నిలబడి, నలుగురూ వినేలాగా, "నా వెంట భోజనం చెయ్యటానికి అభ్యాగతి ఎవరూ లేరే?" అనేవాడు. కాని వీధి వెంట ఎవడైనా సాధువులాటి వాడు రావటం కంటపడితే చలమయ్య చటుక్కున లోపలికి వెళ్ళి తలుపు బిగించుకునేవాడు.

ఒకనాడు రాముడనే పేదవాడు తన భార్యతో సహా బతుకు తెరువు కోసం ఆ గ్రామం వచ్చాడు. ఊళ్ళో విచారిస్తే, చలమయ్య గొప్ప ఉదారుడనీ, సంపన్నుడనీ, అతని వద్ద పని దొరకవచ్చుననీ రాముడికి తెలిసింది.

రాముడు చలమయ్య ఇంటికి వెళ్ళి, తనకూ, తన భార్యకూ పని చూపిస్తే, చలమయ్య ఇచ్చే జీతంతో పొట్ట పోసుకుంటూ, బతికి ఉన్నంతకాలమూ చాకిరీ చేస్తామన్నాడు. ఆసమయంలో చలమయ్య చుట్టూరా నలుగురు పెద్దమనుషులు కూర్చుని ఉన్నారు. వారి ముందు తన పరువు పోతుందని, చలమయ్య రాముణ్ణీ, వాడి పెళ్ళాన్నీ పనిలో ఉంచుకోవటానికి ఒప్పుకున్నాడు, కాని జీతం ఇంత అని అనలేదు.

చలమయ్య ఇంటి వెనక ఒక పడిపోయిన కొట్టం ఉన్నది. అందులో రాముడూ, వాడి పెళ్ళాం ఉంటూ వచ్చారు.



రాముడు ఇంటి పనీ, పై పనీ చేసేవాడు. వాడి పెళ్ళాం పాచిపని అంతా చేసేది. ఇద్దరి చేతా వెట్టిచాకిరి చేయించుకుంటూ, చలమయ్య వాళ్ళకు చాలా తక్కువజీతం ఇచ్చేవాడు. ఆ జీతం రాముడికీ, వాడి పెళ్ళానికీ తిండి తినటానికి కూడా చాలేది కాదు. అందుచేత వాళ్ళు రోజూ నూకల గంజి వండుకుని, అందులో ఇంతఉప్పు వేసుకుని, అందులో రెండు పచ్చిమిరప కాయలు నంజుకుని, కడుపు నింపుకునే వారు.

చలమయ్యగారింటఏనాడూవంటకాలు మిగిలేవి కావు. చలమయ్య భార్య ఒక్క నలుసు మిగలకుండా బొటాబొటిగాచేసేది.

"ఈ వెట్టిచాకిరి ఇంకెక్కడ చేసినా కడుపుకు ఇంత తిండి అయినా దొరుకు తుంది. ఇక్కడినుంచి వెళ్ళిపోదాం," అనేది రాముడిపెళ్ళాం.

రాముడికి కూడా చలమయ్య ఇల్లు విడిచిపెట్టాలనే ఉంది. కాని ఏదోవిధంగా చలమయ్యకు తగిన విధంగా బుద్ధిచెప్పి మరీ ఇక్కణ్ణించి వెళ్ళిపోవాలని వాడి ఉద్దేశం.

ప్రస్తుతానికి వాడు చలమయ్య మీది కోపాన్ని వెటకారం రూపంలో బయట పెడుతున్నాడు. వాడు తిండి తినటానికి కూర్చున్నప్పుడల్లా, "ఏమేవ్, పాయసం వండటం పూర్తిఅయిందా? వేగిరం తీసు కురా! చక్కెర కాస్త జాస్తి వెయ్యి. వచ్చే టప్పుడు రెండు పచ్చ అరటిపళ్ళు పట్టు కురా!" అని భార్యనుకేకవేసేవాడు. వాడి భార్య గంజిలో మరో చిటికెడు ఉప్పువేసి, రెండు పచ్చిమిరపకాయలతో సహా తెచ్చి వాడి ముందు పెట్టేది.

రోజూ రాముడు తన పెళ్ళాన్ని పాయ సమూ, పచ్చఅరటిపళ్ళూ తీసుకురమ్మని గట్టిగా కేకవెయ్యటం చలమయ్య భార్య చెవిని పడింది. ఆవిడకు పాయసం చాలా ఇష్టం. కాపరానికి వచ్చి ఆమె పాయసాన్ని వాసన చూసి అయినా ఎరగదు. పచ్చ అరటిపళ్ళ మాట చెప్పనే అక్కర్లేదు. రాముడి కేకలు విన్నప్పుడల్లా ఆమెకు నోరూరేది.

పట్టలేక ఆమె రాముడి పాయసం సంగతి తన భర్తకు చెప్పింది. చలమ య్యకు చాలా ఆశ్చర్యం వేసింది. తాను ఇచ్చే కొద్ది జీతంతో కూలి దంపతులు పాయసాలూ, అరటిపళ్ళూ ఎలా ఆరగిస్తు



న్నారో అతనికి అర్థం కాలేదు. రాముణ్ణి అడిగి తెలుసుకోవాలనుకున్నాడు.

మర్నాడు రాముడు పనిలోకి రాగానే చలమయ్య వాడితో అదీ ఇదీ మాట్లాడి, "ఏరా, మీ కేమీ లోటు లేదుకద?" అని అడిగాడు.

"మా బతుకులు లోటులేకుండా ఎలా గుంటాయి బాబయ్యా?" అన్నాడు. రాముడు.

"అదేమిట్రా! రోజా పాయసమూ, పళ్ళూ తింటూ బీదఅరుపులు అరుస్తావేం రా? ఆ సంగతేమీ నాకు తెలియదనుకు న్నావా?" అన్నాడు చలమయ్య.

"అదా బాబయ్యా? మాబోటి వాళ్ళకు అందుబాటులో ఉండేవి అవే కదా? మేం తాగే పాయసం నా భార్య బాగా చేస్తుంది కూడా!" అన్నాడు రాముడు.

"పాయసం చాలా తక్కువ ఖర్చులో అయ్యే వంటకమే నన్నమాట!" అనుకు న్నాడు చలమయ్య.

తరవాత కొద్ది రోజులకు చలమయ్య కుమార్తె పెళ్ళిచూపులకు పొరుగూరి కామందూ, అతని కొడుకూ, ముఖ్యులైన బంధుమిత్రులూ ఓ పదిమందిదాకా వచ్చారు. వారందరినీ చూసేసరికి చల మయ్య గుండె గుభేలుమన్నది. వీరందరికీ విందుభోజనం పెట్టక తప్పదు. ప్రయత్నిస్తే ఏ ఖర్చయినా తప్పుతుందిగాని, ఈ ఖర్చు తప్పదు.

ఇంతలో చలమయ్యకు ఒక ఆలోచన వచ్చింది. అతను రాముణ్ణి పిలిచి, "ఒరే, రాముడూ! వెంటనే బజారుకు పోయి, పాయసానికి కావలసిన సామాన్లు కొని, నువ్వు రోజూ తినే పచ్చఅరటిపళ్ళు కొనుక్కురా. ఆ పాయసం నీ భార్యచేతనే వండించు. ఖర్చు మాత్రం సాధ్యమైనంత తక్కువలో పోనియ్," అన్నాడు.

చలమయ్యకు బుద్ధి చెప్పే అవకాశం రాముడికి దొరికింది. వాడు బజారునుంచి కొద్ది చిల్లర సామాన్లు తెచ్చి, తన భార్యకు రహస్యంగా చెప్పి, అతిథులకు వంట చెయ్యమని పంపాడు.

అతిథులు పెళ్ళిచూపులూ, ఇతర లాంఛనలూ పూర్తిచేసి భోజనానికి కూర్చున్నారు.

చలమయ్య భార్య వడ్డనకు రావ డానికి సిగ్గుపడి, ఆపని కూడా రాముడి పెళ్ళాన్నే చెయ్యమన్నది.

"అందరికీ ముందు పాయసనం వడ్డించు," అని చలమయ్య రాముడి పెళ్ళాన్ని ఆజ్ఞాపించాడు.

రాముడి పెళ్ళాం నూకలగంజి పాత్ర తీసుకుని, ఒక్కొక్కరి విస్తరిలోనూ గంజీ, ఉప్పూ, పచ్చిమిరపకాయలూ వడ్డించసాగింది. తన విస్తట్లో పడిన పదార్థాలు చూడగానే పెళ్లికొడుకు తండ్రి పరంధామయ్య ముఖం కందగడ్డలా అయిపోయింది.

వడ్డన ఇంకా తన దాకా రాకమునుపే అతిథుల వాలకంలో మార్పు గమనించి చలమయ్య, "ఏమిటి, బావగారూ, ఆలోచిస్తున్నారు? అది పాయసంలెండి. మీ కోసం ఇవాళ ప్రత్యేకంగా చేయించాను. చల్లారకముందే భోంచెయ్యండి. చల్లారితే బాగుండదు," అన్నాడు.

పరంధామయ్య ఆగ్రహంతో విస్తరి ముందు నుంచి లేచి, "భలేవాడివేనయ్యా! మమ్మల్ని ఇంతగా అవమానిస్తావా? నీతో సంబంధం చేసుకుంటే మా పరువు గంగపాలే! నూకలగంజి పోసి పాయసమంటావా? మాకు పాయసం ముఖమే తెలియదా?" అంటూ తనవారి నందరినీ అక్కణ్ణించి లేవగొట్టి, వేగంగా వెంట తీసుకుపోయాడు.

ఈ సంగతి క్షణాల మీద ఊరంతా పాక్కిపోయింది.

చలమయ్యకు రాముడి మీదా, వాడి పెళ్ళాం మీదా భరించరాని ఆగ్రహం వచ్చింది. అతడు రాముడి మీద విరుచుకు పడి, "భ్రాష్టుడా! నీ పెళ్ళాం చేత పాయసం చేయిస్తానని చెప్పి, నూకలగంజి పోయించి నలుగురిలోనూ నా పరువు తీశావుగదరా!" అంటూ అరవసాగాడు.

వాకిట పోగైన నలుగురూ సంగతి వివరంగా గ్రహించారు.

రాముడు మాత్రం తాపీగా, "గతిలేని వాడికి గంజే పాయసమని మీకు తెలియదా? మీరిచ్చే జీతం డబ్బులతో మాకు నూకల గంజికి మించిన పాయసంఎలా వస్తుంది? మేం రోజూ తాగే పాయసమే గదా మీరు చెయ్యమన్నది? మధ్య మా తప్పేమున్నది?" అన్నాడు.

చలమయ్యకు తల తీసేసినట్టయింది. మరేమీ మాట్లాడలేకపోయాడు. అతనికి తగిన శాస్తి చేసినందుకు రాముణ్ణి ఊళ్ళోవాళ్ళు మెచ్చుకున్నారు.





# అతి తెలివి

పరమేశం రంగనాథానికి ఒక్కగానొక్క కొడుకవడం వల్ల గారాబంగా పెరిగాడు. వాడికి అంతగా చదువు అబ్బలేదు. తాను చాలా తెలివైన వాడిననీ, తనకు చదువు అవసరంలేదనీ వాడి ఉద్దేశం. రంగనాథం చదువుకోమని పోరితే, తన మాటకారితనంతో తండ్రి నోరు మూయించేవాడు.

ఒకనాడు జులాయిగా తిరిగి వచ్చిన కొడుకును రంగనాథం గట్టిగా తిట్టి, "చదువుకోకపోతే ఎలా బతుకుతావురా?" అన్నాడు.

"నన్ను అనవసరంగా తిట్టకు. తండ్రులకంటే లోకంలో కొడుకులే తెలివైనవాళ్ళు, తెలుసా?" అన్నాడు పరమేశం కోపంగా.

"ఎలా?" అన్నాడు రంగనాథం అయోమయంగా.

"తండ్రుల కంటే కొడుకులే తెలివైన వారని నేను రుజువుచేస్తే, ఇంకెప్పుడూ నువ్వు నాజోలికి రాకూడదు, సరేనా?" అన్నాడు పరమేశం.

"సరే, చెప్పు," అన్నాడు రంగనాథం.

"మేఘసందేశం కావ్యాన్ని ఎవరు రాశారు?" అని అడిగాడు పరమేశం.

"కాళిదాస మహాకవి!" అన్నాడు రంగనాథం.

"రఘువంశం?" అని అడిగాడు పరమేశం.

"కాళిదాసే!" అన్నాడు రంగనాథం.

"కుమారసంభవం ఎవరు రచించారు?" అని అడిగాడు పరమేశం.

"అది కూడా కాళిదాసే," అన్నాడు రంగనాథం

పరమేశం నవ్వి, "చూశావా? వాటినన్నిటినీ కాళిదాసే రచించాడు. మరి, వాళ్ళ తండ్రి ఎందుకు రచించలేకపోయాడు?" అంటూ అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

తన కొడుకు అతితెలివికి నవ్వాలో, ఏడ్వాలో అర్థంకాలేదు రంగనాథానికి. **– దాసరి వెంకటరమణ.**



# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1998 మార్చి నెల సంచికలో ప్రకటింపబడును.



M.NATARAJAN



M.NATARAJAN

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * **జనవరి నెల 25వ తేదీలోగా,** వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:

**చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, చెన్నయ్‌- 600 026**

## నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : అటలాడుటకు చూసేపాపా...!

రెండవ ఫోటో : మాటలాడనని చిన్నచూపా...!

పంపినవారు : చిరంజీవి టి.ఎమ్. ప్రణతి D/o టి.జె. మోహన్ కుమార్

న్యూబాకారం, గాంధీనగర్, హైదరాబాదు -500 020 (ఆం.ప్ర)

## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 72-00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, చెన్నయ్ - 600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., Chandamama Buildings, Chennai - 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, 188, N.S.K. Salai, Vadapalani, Chennai - 600 026 (India) Editor : NAGI REDDI.

దూరతీరాలలో ఉన్న మీ బంధుమిత్రులకు
మీరు ఇవ్వదగిన ప్రియాతిప్రియమైన కానుక

# చందమామ



వారికి కావలసిన భాషలో చందమామను అందజేయండి:

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీష్, గుజరాతీ, హిందీ, కన్నడం, మలయాళం,
మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు.

దూరదేశంలో ఉన్నప్పటికీ వారికి మాతృదేశంలో ఉన్న మధురానుభూతిని కలిగించండి।

సంవత్సర చందా:

ఆస్ట్రేలియా, జపాన్, మలేషియా & శ్రీలంక

సీ మెయిల్ ద్వారా: రూ. 129.00 ఎయిర్‌మెయిల్ ద్వారా: రూ. 276.00

ఫ్రాన్స్, సింగపూర్, ఇంగ్లండు, అమెరికా,
పశ్చిమజర్మనీ & ఇతర దేశాలు

సీ మెయిల్ ద్వారా: రూ. 135.00 ఎయిర్ మెయిల్ ద్వారా: 276.00

మీ చందాలను 'చందమామ పబ్లికేషన్స్' పేరు మీదుగా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గాని,
మనిఆర్డర్ ద్వారా గాని కింది చిరునామాకు పంపండి:
సర్క్యులేషన్ మేనేజర్, చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600026

